# స్ఫూర్తి కణాలు










## రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్

ఆంధ్ర ప్రాంతము

# ముందు మాట

సంఘశిక్షావర్గలోని బోధకథలు ఆధారంగా ఈ చిన్ని పుస్తకము ముద్రింపబడుచున్నది. ముఖ్యశిక్షక్ ఆపై కార్యకర్తలు తాము చదివి శాఖలలో చిన్నకథల (5 ని॥-10 ని॥ల పాటు) రూపంతో స్వయంసేవకు లకు చెప్పుటకు ఉపకరించగలవు. సమాజంలోని ప్రతి వ్యక్తికి ప్రేరణను, స్ఫూర్తిని యివ్వగలవని ఆశిస్తున్నాము.

శిక్షావర్గలోని అమృతవచనములు కూడ ఈ పుస్తకములో పొందు పరచబడినవి. వీటిని చదివి, విశ్లేషణ చేసినచో మన జాతీయ జీవనము యొక్క సమగ్రకల్పన యేర్పడగలదు. కిశోర, తరుణ స్వయంసేవకులు వీటిని కంఠస్థము చేసి ఏకత్రీకరణలలో భావోద్రేకముగా చదివినచో స్ఫూర్తివంతముగా నుండగలదు.

—ప్రకాశకులు

# 1. "అరె, నానా ! పొరపాటు జరిగింది"

మార్కెట్ నుంచి యింటికి తిరిగి వస్తూ దారిలో అకస్మాత్తుగా ఆగి పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ, నానాజీ దేశ్‌ముఖ్‌తో- "అరె నానా, పొరపాటు జరిగింది." నా జేబులో నాల్గుపైసలుండాలి. వాటిలో ఒకటి చెల్లనిది రెండు పైసలు ఇందాక ధాన్యం అమ్మే ముసలమ్మకు ఇచ్చాను ఇప్పుడు నాదగ్గరున్న రెండు పైసలూ మంచివే. పద ! తిరిగి వెళ్ళి ఆమెకు మంచి పైసా యిచ్చిపద్దాం" అన్నారు దీనదయాళ్‌జీ.

ఆయన ముఖంలో తప్పుచేశానన్న భావన కనపడుతోంది. ఈ సంఘటన 1940 నాటిది. ఎం. ఏ; చదవటానికి దీనదయాళ్‌జీ; సంఘ శాఖ ప్రారంభించడానికి నానాజీ ఆగ్రా వెళ్ళి, ఒకేచోట కలిసి వుంటున్న సమయమది.

ధాన్యం అమ్మే ముసలమ్మకు ఈ విషయం చెప్పినప్పుడు, ఆమె ఇప్పుడు నీ పైస వెదుకుతూ ఎవరు కూర్చుంటారు. ఇచ్చినదేదో యిచ్చావు. సరిపోయిందిలే, వెళ్ళు, వెళ్ళు" అన్నది. కానీ దీనదయాళ్‌జీ అంతటితో ఊరుకుంటారా ! ఆమె డబ్బులోంచి ఆ పైసను తాను వెదికి వెదికి తీశారు- దానికి బదులుగా మంచి పైసా యిచ్చిన తర్వాతనే ఆయన ముఖంలో సంతృప్తి కనబడింది.

ఆ వృద్ధురాలి కళ్ళలో నీళ్ళు నిండాయి. "నువ్వెంతో మంచి వాడవు నాయనా, భగవంతుడు నిన్ను చల్లగా చూస్తాడు" అన్నదామె.

## 2. మహాదేవ గోవిందరానడే

సంజె చీకట్లు క్రమ్ముకున్నాయి. బొంబాయి ఉన్నత న్యాయ స్థానంలో తమ పని ముగించుకొని ప్రముఖ న్యాయమూర్తి ఒకరు ఇంటికి తిరిగి వస్తున్నారు. దారిలో ఒక వృద్ధ స్త్రీ పెద్ద కట్టెల మోపు పెట్టుకొని నిలబడివుంది. దారిన వచ్చే పోయ్యే వాళ్ళతో- " అయ్యా, ఈ బరువు కాస్త నా తలపైకి ఎత్తండి, మీకు పుణ్యముంటుంది" అని ప్రాధేయ పడుతోంది. కానీ అందరూ ఆమె మాటలు విననట్లే తమ దారిన తాము పోతున్నారు. ఆ న్యాయమూర్తి మహాశయుడు వృద్ధురాలి మాటలు విని, ఆ మోపునామె తలమీద ఎత్తిపెట్టారు. వారే మహాదేవ గోవింద రానడే.

## 3. చెక్కును సొమ్ము చేయని గుండప్ప

ఆధునిక కన్నడ సాహిత్యంలో దిగ్గజముగా పేరు పొందిన స్వర్గీయ డి. వి. గుండప్ప ఉదార రాజకీయవాది. ప్రఖ్యాత పత్రికా రచయితకూడా. ఆనాటి మైసూరు ప్రభుత్వపు తీరుతెన్నుల గురించి ఎంతో నిర్భయంగా తమ అభిప్రాయాలను వారి పత్రికలో ప్రచురిస్తుండే వారు. ఒకసారి మైసూరు ప్రభుత్వం ఆయనచే ప్రభుత్వం గురించిన ఒకవ్యాసం వ్రాయించింది. ప్రభుత్వంతో తమకెలాంటి అభిప్రాయ భేదం రాని విష యాన్ని గురించిన వ్యాసమది. కొంత కాలం తర్వాత ప్రభుత్వం తరపు ంచి ధన్యవాదాలు తెలిపే ఉత్తరంతో పాటు పారితోషికంగా మూడు ల రూపాయల చెక్కుకూడ వచ్చింది. ఆ రోజులలో బెంగుళూరులో మూడు వేల రూపాయలతో సాధారణమైన బంగళా ఒకటి కట్టుకోవచ్చు. శ్రీ గుండప్ప, ప్రభుత్వం "వల" విసిరిందని తెలుసుకున్నారు. ఆ చెక్కును సొమ్ము చేసికొనకుండా ఒక ఫైలులో వేసి వుంచేశారు. 90

సంవత్సరాల తర్వాత వారి కుమారుడు పాత కాగితాలను వెదుకుతున్నప్పుడు ఆ చెక్కు కనబడింది, అప్పుడీ పాత కథ వెలుగులోకి వచ్చింది.

## 4. మీరు క్రొత్త రామాయణాన్ని తప్పక రచించగలరు!

ఒకసారి సోదరి నివేదిత దసరా వేడుకల నిమిత్తం నాగపూరు వెళ్ళింది. ఆటల పోటీలలో గెలుపొందినవారికి బహుమతి ప్రధానం చేసే నిమిత్తం కళాశాల విద్యార్థులు ఆమెను ఆహ్వానించారు. ఆ సందర్భంలో మాట్లాడుతూ ఆమె" ఇక్కడ హాకీ, క్రికెట్ వంటి విదేశీ ఆటలు ఆడటం చూసి నాకు చాల బాధ కలిగింది. ఇది భోంస్లేల రాజధాని. ఇక్కడ శౌర్య పరాక్రమాలు చూడగలనని భావించి వచ్చాను. కానీ యిక్కడ కోతుల వంటి అనుకరణ మాత్రమే నాకు కనబడుతోంది. ఈ సంగతి ముందే తెలిసి వుంటే నేనసలు వచ్చేదాన్నే కాను. " అని అన్నది.

మరునటిరోజు ఆమెసమక్షంలో నాగపూరులోని ప్రసిద్ధ వ్యాయామ శాలల ప్రదర్శనలు జరిగాయి. చేతిలో ఆయుధాలేవీ లేకుండానే ప్రత్యర్థుల చేతులలోని ఆయుధాలను హస్తగతం చేసుకొనే విద్యాపాటవ ప్రదర్శన జరిగినప్పుడామె **పులకితురాలై** "మీరు క్రొత్త రామాయణాన్ని తప్పక రచించగలరు. సమాజంలో యింకా రావణాసురులున్నారు. నేడు శ్రీరామచంద్రులు కావాలి" అని అన్నది.

## 5. ఈ రోజు నేను నారాయణుడి భోగం చేసాను

ఒక రోజున స్వామి వివేకానంద "కేష్టా' తో- "మీ వాళ్ళందరూ యివాళ్ళ మాతో భోజనం చేస్తారా ? " అని అ. గారు. దానికి "కేష్టా"-

"అయ్యో బాబోయ్! మేము మీ చేతి వంట యింకా తినలేం. అప్పుడే వెగటు పుట్టి పోయింది. మీ ఉప్పు తిండి తించే ప్రాణం పోతుంది" అన్నాడు. "ఉప్పెందుకు తినాలిరా, ఉప్పు లేకుండానే కూరలు వండు తున్నాము. అట్లాగైతే తింటారుకదా!" అని అడిగారు స్వామీజీ. అందుకు కేష్టా ఒప్పుకున్నాడు. ఆ తర్వాత స్వామీజీ ఆదేశంతో మఠంలో ఆసంథా లీలందరికోసం నేతి రొట్టెలు, కూరలు, మిఠాయిలు పెరుగు వగైరా అన్నీ ఏర్పాటు చేయబడ్డాయి. వారందరినీ కూర్చోబెట్టి వడ్డించ సాగారు. తింటూ కేష్టా అన్నాడు- "స్వామీజీ, భలే! మీరు యిటువంటివన్నీ ఎక్కడినుండి సంపాదించారు. మేమైతే యిటువంటి వెన్నడూ అసలు తిననే లేదు" స్వామీజీ వారితో తృప్తికరంగా భోజనం చేయించిన తర్వాత అన్నారు- "మీరు నిజంగా నారాయణ స్వరూపులు, ఈ రోజు నేను నారాయణుడికి భోగం చేశాను." ఆతర్వాత మఠంలోని సన్యాసుల నుద్దేశించి ప్రసంగిస్తూ స్వామీజీ అన్నారు-" చూడండి. వీళ్ళు ఎంతటి అమాయకులు! ఇటువంటి మంచి మనస్సు కలవాళ్ళను, ఇటువంటి కపటంలేని ప్రేమను ఇదివర న్నడూ నేను చూడలేదు. వీరి దుఃఖాన్ని ఏ కొంచెమైన దూరం చెయ్యాలి. నిచో ఈ కాషాయి బట్టలు ధరించి ఏమి ప్రయోజనం. పరుల హితం సం సర్వస్వం అర్పించటమే నిజమైన సన్యాసమవుతుంది.

## 6. అదే నాకు మీరు చెయ్యగల పెద్ద సహాయం

కాశ్మీరుకు చెందిన ప్రఖ్యాత సంస్కృత విద్వాంసులు "కైయట్" భగవంతుని పూజా పునస్కారాలలోనూ, అధ్యయనాభ్యాసాలలోనూ, గ్రంథ రచనా వ్యాసంగాలలోను నిరంతరం నిమగ్నులై వుండేవారు. కుటుంబం ఎట్లా నడుస్తుందో తెలుసుకోవాలన్న ధ్యాసకూడా ఆయనకు వుండేదికాదు. వారి భార్య, నారతో త్రాళ్ళుపేని, గడుపుతుంది.

కాశ్మీరు రాజుకు ఈసంగతితెలిసి బంగారునాణెములను, వెండిబంగారాలను వెంటనే తీసుకొని "కైయట్" కు సహాయ మందించటానికి వచ్చి "దయచేసి ఈ కానుకలను స్వీకరించవలసిందని, వారిని కోరాడు. కాని "కైయట్"- "మా యింట్లో ఏ కొరతలేదు, నాకు ఏ అవసరమూ లేదు" అని చెప్పి నిరాకరించారు.

అప్పుడు రాజు ఒక ఉపాయం ఆలోచించి, "మహాశయా, మీరు గొప్ప విద్వాంసులు. మీకు తెలియనిదేముంది. ఏ రాజు పాలనలో విద్వాంసులు కష్టపడుతుంటారో, ఆ రాజు పాపాన్ని మూటకట్టుకో- వలసి వస్తుంది. కాబట్టి దయచేసి ఈ కానుకలు స్వీకరించండి, అని ప్రార్థించాడు. అప్పుడు "కైయట్" తమ పుస్తకాలను, వ్రాత పత్రికలను మూటకట్టి, భార్యతో - "పద, మనం కాశ్మీరులో వుంటే మన రాజుకు పాపం చుట్టుకుంటుంది; మరెక్కడికైనా పోదాం" అని అన్నారు.

రాజు వెంటనే వారి పాదాలపైబడి, చేతులు జోడించి, ఎంతో వినయంగా- "అయ్యా, నా తప్పును క్షమించండి. నా అభిప్రాయం అది కాదు. మిమ్మల్ని ఆదుకొనే భాగ్యం కలిగించమని కోరుకున్నానంతే" అని అన్నాడు. దానికి "కైయట్" నవ్వుతూ, యిలా అన్నారు. "మీరు నిజంగా నాకు సహాయం చెయ్యాలనుకుంటే మళ్ళీ యింకెప్పుడూ స్వయంగా మీరు యిక్కడికి రావద్దు. మరే ఉద్యోగినీ యిక్కడకు పంపవద్దు. నా పనిలో అడ్డుతగలకండి— అదే నాకు మీరు చెయ్యగలపెద్ద సహాయం."

ఇటువంటి మహా విద్వాంసుల వల్లనే కాశ్మీరం శారదా భూమిగా, **భారత**దేశం జగద్గురువుగా వాసికెక్కింది.

## 7. ఫాదర్ ! మతం అమ్ముకునే వస్తువు కాదు.

స్వర్గీయ "నిమయీసుమే" బెంగాల్‌లోని మాల్దా జిల్లాలోని కెందపుకూర్ శాఖ స్వయంసేవక్. అతని కాలిలో ఏర్పడిన వ్రణం మళ్

దాలోని అనేక రకాల వైద్యం చేయించినా తగ్గకపోవడంతో "రాహ్ తాడా మిషన్"కు చెందిన క్రైస్తవ ఫాదర్ సంహాపై వారిని థాగల్పూర్ లోని చాల పెద్దదైన మిషన్ ఆసుపత్రికి అతని తండ్రి పంపించాడు. 6, 7 నెలల వైద్యం తరువాత 'నిమయీ' పూర్తి ఆరోగ్యంతో ఇంటికి తిరిగి వచ్చాడు. ఒకరోజున క్రైస్తవఫాదర్ నిమయీ తండ్రినిఇంటికివెళ్ళి కలిసి- 'నిమయీ వైద్యం నిమిత్తం ఆరు వేల రూపాయలు ఖర్చయ్యాయి, అయినా నిమయీ క్రైస్తవ మతంలోకి మారితే ఒక్క పైస కూడ చెల్లించ నవసరం ఉండదని' చెప్పాడు. ఇతర సంథాలీం వలనే నిమయీ తండ్రి కూడ ఒక పేదరైతే. కేవలం 12 భీఘాల భూమి మీదనే ఏడెనిమిది మంది వున్న అతని కుటుంబం నడుస్తోంది. ఆయన అందులో ఆరు భీఘాల భూమిని అమ్మివేసి ఫాదర్‌కు ఆరువేల రూపాయలు ఇచ్చివేసి అతగాడితో ఈ విధంగా అన్నాడు. "ఫాదర్- మతం అమ్ముకునే వస్తువు కాదు."

## 8. నేను పైకలకు ఆశపడి పనిచేసేవాణ్ణి కాదు

"ఏమన్నారు ! ఉత్తమ్ ఇకలేడా ?"

"అవును నానా, ఉత్తమ్ పోయాడు. ఒక రోజు తెల్లవారు ఝామున కార్యాలయంలో నిద్రలోనే చనిపోయాడు. మేమంతా విరాళాలు వసూలు చేసి అతని అంత్యక్రియలు జరిపాము. అతని శవయాత్రలో చాల మంది స్వయం సేవకులు పాల్గొన్నారు.

ఆహాఁ ! ఉత్తమ్ మహారాష్ట్రలోని 'ధులియా' జిల్లాలోని పేద వనవాసీ గ్రామమైన 'తలోదా'కు చెందిన భిల్లు జాతి బాలుడు. బస్తాంయులో హామా గా పని చేస్తూ ఉండేవాడు. చిరిగిన బట్టలతో మాసిన టోపితో కనిపిం ఉత్తమ్ కొంచెం చిత్రంగా వ్యవహరించేవాడు. ఆవిచిత్రంలోను ఉత్తమ్‌లో ఒక క్రమం ఉండేది. నిష్ఠావంతుడైన స్వయం సేవక్‌గా జీవించాలని నిత్యమూ తపిస్తుండేవాడు.

1948 లో సత్యాగ్రహం చేసి ఎంతో ఆనందంతో జైలుకెళ్ళాడు. తరువాత ఎన్నికలు ప్రారంభమైనప్పుడు ఎన్నికల సమయమంతా జన సంఘ కార్యాలయంలోనే వుంటుండేవాడు. హమాలీ పని పూర్తిగా మాని వేసి కార్యాలయంలో వచ్చిపోయే వారికి సహాయాలు కల్పించడం; కర పత్రాలు వితరణ చేయడం, సమాచారం అందించడం వంటి పనులు ఎంతో ఉత్సాహంతో చేస్తుండేవాడు.

ఒకసారి కాంగ్రెసుకార్యకర్తలు కొందరుఅతనితో- ఉత్తమ్! నువ్వు మా కార్యాలయంలో పనిచెయ్యి తిండితిప్పలకు పోను నెలకు యాభై రూపాయలు ముట్టజెప్పుతాం" అని అన్నారు. దానికి ఉత్తమ్," నేను పైసలకు ఆశపడి పనిచేసేవాణ్ణి కాదు" అని సమాధానమిచ్చాడు.

ఉత్తమ్ పేదవాడే కాని గతిలేనివాడు కాదు. ఒక నీతిపై నిలబ డటంలో విజయం సాధించాడు ఉత్తమ్. ఎవరైన అనుకున్న ధ్యేయం సాధించేందుకు పిచ్చివాడు కూడా ధ్యేయవాదిగా మారగలడని, జీవితాంతం కూడ ఆవిధంగానే జీవించగలడని 'ఉత్తమ్' రుజువుచేసి చూపాడు.

## 9. శత్రువుతో ఔదార్యం

మహారాష్ట్రకు చెందిన మొదటి బాజీరావ్ పీష్వాకు, హైదరాబాద్ సంస్థానానికిచెందిన నిజాం-ఉల్-ముల్కుకు 1728లో గోదావరీనదీ-తీరం లో భీకర యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో మరాఠీ వీరులు అత్యంత శౌర్య పరాక్రమాలతో పోరాటం సల్పి, విజయం సాధించారు. దానితో ముస్లిం సైన్యాలకు ఆహార సమస్య ఏర్పడింది. అప్పుడే వారి పండగ కూడ వచ్చింది. నిజాం ఎంతో మధనపడి చివరకు బాజీరావు వద్దకు ఒక వార్తను పంపాడు.—"మాకు ఆహారపు సమస్య వచ్చింది. మా పండగ కూడ వచ్చింది. మీరు సహాయం చేస్తే మేమెంతో మేలు పొందిన -వారం కాగలం.

పీష్వా సలహా దారులు సహాయం పంపవద్దని సూచించారు. కాని పీష్వాకు ఈ సలహా కఠోరమనిపించింది. పండుగ జరుపుకోటానికయితే తప్పకుండా సహాయం చేయవలసిందేనని భావించాడు. ఐదువేల ఎడ్ల బండ్లపై ఆహార వస్తువులను పంపించాడు. నిజాం ఎంతో ప్రభావితుడయ్యాడు. చివరకు ఇరువురి మధ్య సంధి కుదిరింది.

## 10. శ్రీకృష్ణుని నీలపురంగు, అనంతత్వాన్ని సూచిస్తుంది

శ్రీ కృష్ణుడు నీలి రంగులో ఎందుకున్నాడో మీకు తెలుసా ? విద్యార్థులను పరీక్షించి చూసేందుకు పండితులైన ఒక సన్యాసి ప్రశ్నించారు. ఆయన వేసిన ప్రశ్న విని చాల మంది తెల్లమొగం వేశారు. ఎవరికీ సమాధానం తోచలేదు. చివరికొక విద్యార్థి లేచి,- "స్వామీజీ, శ్రీ కృష్ణుని నీలపురంగు అనంతత్వాన్ని సూచిస్తుంది," అని అన్నాడు. "ఆట్లాగా ఎలా చెప్పగలవు ? " అని ప్రశ్నించారు. మరల స్వామీజీ అప్పుడా విద్యార్థి తన అభిప్రాయాన్ని చాల చక్కగా సమర్థించుకుంటూ ఇలా వివరించి చెప్పాడు. "నీలి గగనం- నీల సాగరం ఏ విధంగా అనంతాలో ఆ విధంగానే శ్రీకృష్ణుని మహిమకు కూడా అంతులేదు. కాబట్టి అతని రంగు కూడ నీలంగానే వుంది, ఈ విధంగా నీలపు రంగు అనంతత్వాన్ని సూచిస్తుంది. "

ఆ సన్యాసియే గాక అక్కడ వున్న వారందరూ కూడా ఈ సమాధానం విని ఆనంద సంభరితులయ్యారు. ఆ పండిత సన్యాసి మరెవరో కాదు- స్వామి వివేకానందయే. చక్కని సమాధానం చెప్పిన బాలుడే ఆ తరువాత గొప్ప రాజకీయవేత్తగా ప్రసిద్ధికెక్కిన చక్రవర్తి "రాజగోపాలాచారి."

## 11. ఉన్నత హృదయం

కలకత్తా దగ్గరలోని బేహలా శాఖలో ఒక స్వయంసేవక్ వుండే వాడు. వారిది తూర్పు బెంగాల్- నుంచి శరణార్థులుగా వచ్చిన కుటుంబం. ఇంట్లో పేదరికం తాండవిస్తుండేది. "స్వస్తిక్" "ఆర్గనైజర్" మున్నగు పత్రికలు అమ్మగా వచ్చిన కొద్ది ఆదాయంతోనే ఇంట్లోని నలుగ్గురైదుగురి జీవితం ఏదో ఒక విధంగా నడుస్తుండేది. ఒక రోజు ఆ స్వయంసేవకుని సోదరికి ఆరు వందల రూపాయలు దొరికినవి. ఆమె ఆ డబ్బును ఇంటికి తెచ్చింది.

అన్నా చెల్లెలు- వారి తల్లి, అందరూ ఏకాభిప్రాయంతో, ఆ సొమ్మును "కళ్యాణ ఆశ్రమానికి ఇవ్వటానికి నిశ్చయించుకున్నారు. వారి ఉన్నత హృదయాలను దారిద్ర్యపు జ్వాలలు దహించలేక- పోయాయి.

## 12. ఐతేయేం ! మా దళాన్ని ఓడిపోనీయను

మహారాష్ట్రలోని ఒక గ్రామం. సంధ్యాసమయం. కబడ్డీ ఆట సాగుతోంది. ఎదుటి దళంకు చెందిన నాయకుడు రెండవ వైపుకు వెళ్ళి చాల మంది ఆటగాళ్ళను చంపి వచ్చాడు. దానితో ఆ దళం ఓడిపోయే పరిస్థితి యేర్పడింది. మళ్ళీ ఒక్కసారి ఆ మొదటి దళం నాయకుడే శత్రు పక్షంవైపు వెళ్ళగానే ఆ దళంలో చిన్న బాలుడు అతనిని గట్టిగా పట్టుకున్నాడు. ఆ నాయకుడు విదిలించి విడిపించుకోవాలని ప్రయత్నించాడు. కాని ఆ బాలుడు ఉడుం పట్టు పట్టాడు.

"అరేయ్ గోపీ వదిలెయ్యి. మీ అన్నయ్యే గదా ! వదిలేసెయ్యి," అని ఆ బాలుడి స్నేహితుడన్నాడు. అప్పుడతను "ఐతే యేం. మా దళాన్ని ఓడి పోనీయను" అన్నాడు. చివరికి తమ్ముని దృఢత్వానికి

ఆస్న లొంగిపోవలసి వచ్చింది. ఎంత సాహస మతడిది. ఎంతటి దృఢత్వమున్నది అతనిలో !

ఈ గోపీనే పెద్దయిన తర్వాత "గోపాలకృష్ణ గోఖలే" గా ప్రసిద్ధ చెందాడు.

## 13. జపాన్ యువకుని దేశభక్తి

స్వామి రామతీర్థ జపాన్ వెళ్ళినపుడు కేవలం పండ్లు మాత్రమే ఆహారంగా తీసుకునేవారు. ఒకరోజు చాలా దూరం రైలులో ప్రయాణం చేయవలసివచ్చింది. మార్గమధ్యంలో ఒక స్టేషన్‌లో పండ్లు కొనాలని చూచారు. కానీ లభించలేదు. తరువాతి స్టేషన్‌లో కూడ దొరకలేదు. జపాన్‌లో పండ్లు దొరకవు కాబోలు అని పైకి అనేశారు. ఆయన మాటలు విన్న ఒక జపాన్ యువకుడు ఎక్కడికో పరుగెత్తుకు వెళ్ళాడు. తిరిగి బండి బయలుదేరకముందే, ఒక పండ్ల బుట్టను తీసుకువచ్చాడు. ఆబుట్టను స్వామీజీకి సమర్పించాడు. స్వామీజీ క్షణకాలం ఆశ్చర్యచకితులయ్యారు. అతనినే చూస్తుండిపోయారు. తరువాత పండ్ల ధర తెలుసుకుని యివ్వ బోయారు.

అందుకా యువకుడు చిరునవ్వు నవ్వి "ధరా ! మీరు మీ దేశం వెళ్ళి, జపానులో పండ్లు దొరకవు అని చెప్పకుండా వుండటమే దీని ధర" అని అన్నాడు.

ఆ యువకుని దేశభక్తి చూచి ఎంతగానో ప్రభావితులయ్యారు, స్వామి రామతీర్థ.

## 14. చెంపపెట్టు సమాధానం

ఒక తత్వవేత్తగా, ఆలోచనాపరులుగా డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ అందరికీ తెలిసినవారే. ఒకసారి లండన్‌కు చెందిన ఆంగ్ల మిత్రు డొకరు

"మీ దేశం ప్రజలు చాలా రంగుల్లో కనబడుతుంటారు. కొందరు నలుపు, కొందరు తెలుపు, మరి కొందరు గోధుమ... ఇంకొందరు మరో రంగులో కనబడుతుంటారు. కానీ మా దేశంలో ప్రజలు అంతా ఒకే రంగులో ఉంటారు" అని అన్నారు. దానికి రాధాకృష్ణన్- "అవును మీరు చెప్పినది నిజమే. ప్రపంచంలో కొందరు అనేక రంగులలో ఉంటారు. కానీగాడిదలు మాత్రం ఒకే రంగులో వుంటాయి." అని చెంపపెట్టు సమాధానమిచ్చారు.

## 15. వైద్యుని సేవాధర్మం

దురద వాతబడి రోదిస్తున్న 75 సం॥ల నిరుపేద వృద్ధునికి వేప ఆకులు గుండ చేసి తినిపించమని, మజ్జిగ త్రాగించమని "గాంధీజీ" ఒక వైద్యుని పురమాయించారు. ఆ ప్రకారం అతను వేప ఆకులు గుండ చేసి యిచ్చాడు. అది తిని, మజ్జిగ త్రాగమని చెప్పాడు. మరుసటిరోజుగాంధీజీ వైద్యుని పిలిచి ఆ వృద్ధునకు ఎంత మజ్జిగ త్రాగించావని ప్రశ్నించారు. వైద్యుడు ఏమీ చెప్పలేకపోయాడు. ఏ విషయమూ తెలుసుకునేందుకు ఆ వృద్ధుని ఇంటికి వెళ్ళాడు. ఆ వృద్ధుడు ఏడుస్తూ... నా దగ్గర మజ్జిగ త్రాగగల డబ్బు లెక్కడివని చెప్పాడు.

వైద్యుడీ సంగతి గాంధీజీకి చెప్పినప్పుడు ఆయన బాధా తప్త హృదయులై "నువ్వు విదేశాల్లో చదివిన డాక్టరువనుకుంటాను. భలే! వాడివయ్యా! ఇప్పుడు కూడ నువ్వు అతనిచే మజ్జిగత్రాగించలేదన్నమాట. గ్రామం నుంచి తెప్పించి మజ్జిగ త్రాగించి వుండవలసింది. ఏడుస్తున్న ఆ వృద్ధుని అక్కడే వదలి, నా దగ్గరకు ఏమి చెబుదామని వచ్చావు"— బాపూజీ ఇంకా ఇలా అన్నారు— "వైద్యుని ధర్మం సేవ చేయడం. ఏ మందు వాడాలో సూచించడమూ, దానికి పథ్యం చెప్పడం మాత్రమే కాదు. రోగి నయమయ్యేవరకు బాధ్యత అతనిదే అవుతుంది.

## 16. ఇదో క్రొత్త ఫేషన్!

భారతదేశంలో పురావృక్ష శాస్త్రానికి (Polio Botany) జనకు డైన ప్రొ॥ బీరబల్ సాహనీ నిరాడంబరంగా వుండేవారు. కేంబ్రిడ్జ్ విశ్వ విద్యాలయంలో తనకు లభించే 60 పౌండ్ల విద్యార్థి ఉపకారవేతనంతోనే సంవత్సరమంతా గడిపేవారు. విదేశాలకి వెళ్ళేటప్పుడు తీసుకువెళ్ళిన పైజామా, చొక్కాలనే 8 సం॥లపాటు ఉపయోగించారు. ఒకసారి వారి పాతకోటు గుండీ పెట్టుకొనే చోటు చిసిగిపోయింది. దానితో కోటును తిరగవేసి ధరించారు. తిరగవేయటంతో కాలర్‌కు, మిగతా కోటుకు రంగులో తేడా కనపడుతోంది. విచిత్రమైన ఈ మార్పుకు, తోటివారు కారణం అడిగినప్పుడు వారు తమసహజధోరణిలో "ఇదో క్రొత్తఫేషన్"- అని చెప్పేవారు.

## 17. నేనే బెంగాలీని, ఏం చేస్తారో చెయ్యండి

డ్రైవర్ అకస్మాత్తుగా బ్రేకు వేశాడు. బస్సు కుదుపుతో ఆగింది. ప్రయాణీకులు ఏమైంది, ఏమైంది అని అనుకుంటుండగానే బయటి నుంచి గర్జించినట్లు అరిచారెవరో. "బస్సులో వున్న బెంగాలీ లందరిని క్రిందికి దింపివేయ్" —"బస్సులో వున్న వారందరినీ వారి గమ్యం చేర్చటం నా విధి. ఎవరినీ దింపను" అని అన్నాడు డ్రైవర్. మరో గొంతు గర్జించింది- నువ్వు కూడా దిగకపోతే ఇవ్వాళ నీ అంతం చూస్తాం. బస్సులో గందరగోళం బయలుదేరింది.

అస్సాంలో విదేశీయులను తరిమివేయాలన్న ఉద్యమ ఆవేశంలో బెంగాలీలందరిపట్ల విద్వేష భావన రెచ్చగొట్టి, భాషాకలహాల జ్వాలలలో బ్రహ్మపుత్రలోయను నెట్టటానికి, జాతీయవ్యతిరేకశక్తులు పనిచేస్తున్నాయి. "స్వతంత్ర అస్సాం" పేరుతో తమకంటూ వేరే పెట్టుకోవాలనుకుంటున్నారు వారు. అప్పటికే కొన్ని అవాంఛనీయ సంఘటనలు జరిగాయి.

రానున్న ఉపద్రవం చూసి, బస్సులోని వారందరూ ప్రత్యేకించి బెంగాలీభాష మాట్లాడేవారు భయభీతులవుతున్నారు. అప్పుడు వయోవృద్ధు ఠాకరు బస్ నుంచి దిగారు. గంభీరమైన తమ కంఠంతో— నేనే బెంగాలీని. ఏం చేస్తారో చెయ్యండి, అన్నారు. వారి ముఖ కవళికలలో అస్సామీ భాషీయులన్నది తెలుస్తోంది. కానీ గంభీరముద్ర దాల్చిన వారి స్వరూపాన్ని, వారి దృఢ నిశ్చయాన్ని చూచిన అల్లరి మూకకు ఏమీ మాట్లాడటానికి ధైర్యం చాలకపోయింది. అంతేగాదు, ఎక్కడి వాళ్ళు అక్కడే నిల్చుండిపోయారు. దిగాలు పడివున్న యాత్రికులందరిమనస్సులు ఆ వృద్ధుని పట్ల కృతజ్ఞతా భావంతో నిండిపోయాయి.

## 18. కబీరు భక్తి భావం

సంత కబీరు దాసు జీవితం యావత్తూ దాదాపు కాశీలోనే గడిచి పోయింది. కానీ తమ అంతిమ దినాల్లో ఆయన "మగహర్" గ్రామానికి వెళ్ళాలనుకున్నారు. మగహర్‌లో చనిపోయిన వారు నరకానికి పోతారని చెప్పుకుంటుండే వారు. కబీరు నిర్ణయం సహజంగానే అక్కడి వారికి ఆశ్చర్యం కలిగించింది. వారు కాశీమహాత్మ్యంగురించి "మగహర్" కున్న అపవిత్రతను గురించి ఆయనకు గుర్తు చేశారు. కానీ కబీరు ఆత్మ విశ్వాసం ఎంతో అద్భుతమైనది. "కాశీ యేమిటి ? మగహర్ ఏమిటి ? రాముడే నా హృదయంలో బస చేస్తున్నాడు. అయినప్పటికీ మోక్షం పొందటానికి కాశీలోనే ఈ తనువును త్యజించ వలసి వుంటే యింక రాముని కొలిచి ప్రయోజనం యేమిటి? అన్నాడు కబీరు.

కా. కాశీకా మగహర్ ఊసర్, హృదయ్ రామ్ బస్ షేరా
జో కాశీ తన్ తజై కబీరా, రామ్ హి కౌన్ నిహోరా॥

## 19. హిందువుల ప్రభుత్వం సెక్యులరిజానికి వ్యతిరేకమా?

ఒకసారి ఒక ఆంగ్లేయుడు ప॥ పూ॥ గురూజీని కలవాలని వచ్చాడు. సంభాషణలలో అతడు "భారత దేశం సెక్యులర్ దేశం. కానీ మీరు హిందూ ప్రభుత్వం స్థాపించాలనుకొంటున్నారు. అటువంటి పరిస్థితిలో సెక్యులరిజం గతేం కాను?" -అని ప్రశ్నించాడు.

శ్రీ గురూజీ:- మీ బ్రిటన్ సెక్యులర్ రాజ్యం కాదా?

ఆంగ్లేయుడు:- అవును.

శ్రీ గురూజీ:- కేవలం ప్రొటెస్టెంటు మతస్థులకు మాత్రమే మీ దేశంలో రాజు అయ్యేందుకు అవకాశముంది. మరే క్రైస్తవులకు ఆ అవకాశం లేదు గదా!

ఆంగ్లేయుడు:- అవును.

శ్రీ గురూజీ:- కేవలం ఒక వర్గానికి చెందిన ప్రభుత్వమే మీ దేశంలో వున్నప్పటికీ మీ వద్ద సెక్యులరిజం ఎట్లా నడుస్తోంది? దానికేం ముప్పు వచ్చింది? ఏమీ రాలేదు. మరి మా భారత దేశంలో హిందువుల ప్రభుత్వం ఉంటే సెక్యులరిజానికి భంగం వాటిల్లుతుంది అని ఎందుకు అనుకుంటున్నారు? చెప్పండి.

ఆ ఆంగ్లేయుడు మరి నోరు తెరవ లేదు.

## 20. శ్రీపతి కవి నిశ్చల భక్తి

మొగల్ చక్రవర్తి అక్బరు దర్బారులో వుంటున్న శ్రీపతి కవి భగవంతునికోసం తప్ప మరెవ్వరి కీర్తి గానం కోసం తన పాండిత్యాన్ని

ఉపయోగించలేదు. చివరకు చక్రవర్తి కోసం కూడ వినియోగించలేదు. అతనిపై ఈర్ష్య ఉన్న భట్రాజు కవులు కొందరు అతను లొంగి పోవటమో, లేని పక్షంలో దర్బారు విడిచి వెళ్ళి పోవటమో ఏదో ఒకటి జరిగే విధంగా కుట్ర పన్నారు. "సవైయ్యా" ఛందస్సులో ఉన్న ఒక పద్యపు చివరి పాదం తయారు చేసి దానికి ముందు పాదాలను దర్బారు లోని కవులందరూ పూరించాలని ఆదేశించేందుకు అక్బరును ఒప్పించారు. వాటి చివరి పాదం ఇది:- కరో సబ్ ఆశ్ అక్బర్ కీ" (అందరూ అక్బరు కృపకు పాత్రులవుదురు గాక అని అర్థం) చివరకు శ్రీపతి కవి లేచి నుంచున్నాడు. అందరూ ఊపిరి బిగబట్టి ఏమి జరుగుతుందోనని చూస్తున్నారు.

శ్రీపతి తమ పద్యాన్ని వినిపించారు:-

ఏక్ హి ఛాందీ కే దూజే భజే, సోరసనా ఉస్ లబ్బర్ కీ
అబ్ కీ దునియా గునియా జోబనీ, వహ బాంఘతి ఫేంట్ ఆడంబర్ కీ
కవిశ్రీ శ్రీపతి ఆసరోరామ్ హికో, హమ్ ఫేంట్ గహీ బడ్ జబ్బర్ కీ
జినకీ హారిమే హై ప్రీతి నహీ, సోకర్ సబ్ ఆశ్ అక్బర్ కీ॥

ఈశ్వరుని కాదని మరొకరిని భజించే అబద్ధాల కోరుల నాలుకలు దగ్ధమై పోవాలి. ఈ మధ్య లోకం చాలా లౌక్యంగా సాగుతోంది—ఆడంబరాన్నే అందలాలెక్కిస్తున్నారందరూ. కాని శ్రీపతి కవికి మాత్రం శ్రీ రాముడే ఆధారం. తద్వారా అతడు ఎదురు లేని శక్తిశాలి పక్షం వహిస్తున్నాడు. ఆ హరిపై విశ్వాసం ప్రేమ, లేని వారందరూ అక్బరు దయకు పాత్రులవుదురు గాక.

## 21. డాక్టర్‌జీ ప్రశ్నకు రూయికర్ గారి సమాధానం

ఒక రోజు ఉదయాన డాక్టర్ జీ ఐదుగురు స్వయం సేవకులతో కలసి కార్మిక నాయకుడు శ్రీ రూయికర్ గారి ఇంట్లో "టీ" త్రాగుతున్నారు. ఆ సందర్భంలో రూయికర్ గారు వారి పైన సంఘంపైన మత తత్త్వవాదులన్న ఆరోపణ మోపారు. అప్పుడు డాక్టర్ జీ- "నేను మిమ్మలను ఒక ప్రశ్న అడగాలనుకొంటున్నాను. సరియైన సమాధానం చెబుతారు కదా?" అని అడిగారు. దానికి రూయికర్ గారు "నే నెప్పుడు అబద్ధం చెప్పాను?" అని అన్నారు.

ఈ రాత్రి రెండు గంటలకు ఎవరైనా మిమ్ములను నిద్ర లేపి రూయికర్ జీ మళ్ళీ భారత దేశంలో శివాజీ పాలన ప్రారంభమైందని చెప్పారనుకోండి- మీకు ఏమనిపిస్తుంది?" అని ప్రశ్నించారు డాక్టర్ జీ. "అరె డాక్టర్ దీనిలో ప్రత్యేకంగా చెప్పవలసిందేముంది. అప్పుడు నా ఆనందానికి పట్ట పగ్గాలుండవు. అందరికీ మిఠాయిలు పంచిపెడతాను, పండుగ జరుపుతాను" అన్నారు రూయికర్ గారు.

డాక్టర్ జీ నవ్వుతూ- "అయితే చెప్పండి చివరికి మీకూ, మాకూ తేడా ఏముంది? మేము ఆ పండుగ జరుపుకునే పరిస్థితిని నిర్మాణం చేస్తున్నాం. మేము ఈ విషయం స్పష్టంగా చెబుతాం. ఆ స్థితి నిర్మాణం చేయగలమన్న ఆత్మ విశ్వాసం మా కుంది. మీ ఆశలన్నీ ముక్కలయ్యాయి. మీకు మన సమాజంపైన విశ్వాసం పోయింది. నాకు మన సమాజంపైన సంపూర్ణ విశ్వాసం వుంది. పని చేసే సత్తా కూడ వుంది." అని అన్నా . రూయికర్ గారు శిలా సదృశులై చూస్తుండి పోయారు.

## 22. లాంగుల సేవలో బాబా ఆమ్టేజీ

కుష్ఠు పీడితులకు, అంగవికలురకు ఆత్మీయుడైన సమాజ సేవకులు "బాబా ఆమ్టేజీ" ఒక సారి ట్రక్కు గుద్దుకొనగా, ఘోర

ప్రమాదానికి గురయ్యారు. ఈ వార్త తెలియటంతోనే, ఆ దేవ దూతకు తగిన సదుపాయాలు కలిగించే నిమిత్తం చంద్రపూర్ (విదర్భ) జిల్లా కలెక్టరు మరియు కమీషనరు హుటాహుటిన బాబా ఆశ్రమానికి వచ్చారు. అక్కడ అశ్రుపూరిత నయనాలతో వేలాది మంది కుష్ఠ రోగులు, అంధులు అంగ వికలులు, అనాథలు బారులు తీరి నిల్చున్నారు. బాబాయే వారందరికీ తండ్రి, మిత్రుడు అన్నీ.

కొన్ని రోజులు చికిత్స పొందిన తరువాత మానసిక పరీక్ష నిమిత్తం బాబాను "నవజీవన్" ఆస్పత్రికి తీసుకు వెళ్ళారు. అప్పుడు చక్రాల కుర్చీలో కూర్చొని ఉన్న బాబాను చాలా మంది పత్రికా విలేఖరులు చుట్టుముట్టారు. జరిగిన ఘోర ప్రమాదం విషయంలోను ఆస్పత్రిలో ఉన్నప్పుడు వారి వ్యక్తిగత అనుభూతి గురించి తెలుసుకోవాలని వచ్చారు వారు. కానీ, సమాజసేవ చేసేందుకే సమర్పితులైన మహానీయునికి వ్యక్తిగత సుఖదుఃఖాలు ఏమీ ఉండవని బాబా మొదటిమాటల్లోనే వారికి అర్థమైనది. బాబా యిలా అన్నారు- ఈ సంవత్సరంవికలాంగుల సంవత్సరంగా ప్రకటించబడింది. విధి నన్ను కొన్నిరోజులు అంగవికలుని చేసి ఆ విధమైన జీవితానుభవానికి అవకాశం కల్పించింది. దయనీయమైన అంగ వైకల్యంతో గడుపుతున్న నాకు అంగ వికలురుగా, చేత భిక్షా పాత్ర వహించి, అన్నమో రామచంద్ర అని, ఈ దేశంలో తిరుగాడుతున్నట్లు కనబడుతున్నారు. మీ పత్రికా విలేఖరుల ద్వారా నేనీ ప్రభుత్వానికి, ప్రజలకు ఒక విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ వికలాంగుల సంవత్సరంలో, వికలాంగుల కొరకు చౌకగా కృత్రిమ అవయవాలను తయారు చేసి అందించే పని ప్రారంభించ వలసిందిగా కోరుతున్నాను.

## 23. సిపాయిపరీక్ష

సుమారు 1942 నాటి మాట. మియావలీ జైలులో (నేడది పాకిస్తాన్‌లో ఉంది) అధికారి తనిఖీ చేస్తున్నాడు. ఒక్కొక్క కాపలా దారునికీ సరియైన సంకేతం చెప్పి ముందుకు సాగిపోతున్నాడు. ఒక కాపలాదారుని వద్ద తప్పు సంకేతం చెప్పాడు. వెంటనే ఆ కాపలాదారుడు "ఆగు! అడుగు ముందుకు వేసావంటే కాల్చేస్తాను" అని గర్జించాడు. ఒక మామూలు సిపాయికి ఇంత ధైర్యమా అని ఆఫీసరుకు కోపం వచ్చింది. అతనిపై విచారణ జడిపారు.

"నేనేమీ తప్పు చేయలేదు. అందువల్ల క్షమాపణ కోరలేను" వినయ పూర్వకంగా బదులు చెప్పాడు. క్షమాపణ కోరనట్లయితే ఆరు నెలలు జైలు శిక్ష పడుతుందని చెప్పారు.

"పై అధికారిని కాల్చడానికి సిద్ధం కావడం తప్పుకాదా?" అని విచారణ జరుపుతున్న ఉన్నతాధికారి గద్దించి అడిగాడు.

"నాకు ఆయనను కాల్చే ధైర్యమెక్కడిదీ? ఆయనే విధి నిర్వహణలో ఎటువంటి సంకోచము కూడదనే ఆజ్ఞాపించి యున్నారు" వినయంగా అన్నాడు.

ఎంతగా నచ్చ చెప్పినప్పటికీ సిపాయి క్షమాపణ కోరలేదు. ఆరు నెలల జైలు శిక్ష విధించారు. వృద్ధురాలయిన తల్లి, అనారోగ్యంతో బాధ పడుతున్న భార్య, పిల్లలు దుఃఖంతో ఇంటికి వెళ్ళారు.

కొంత సేపయిన తరువాత ఉన్నతాధికారి ఆ సిపాయి వద్దకు వచ్చాడు. అతని భుజానికి హవల్దార్ బాడ్జి గుచ్చుతూ "ఇందాక జరిగిన దంతా నాటకం. నీ దీక్షను పరీక్షించాము. నీవు పరీక్షలో నెగ్గావు" అన్నారు. సిపాయి ఆనందించాడు.

## 24. హిందుస్థానీల దండ రుచిమాడు

"కర్నల్ వైలీని తుపాకితో కాల్చిన మదన్‌లాల్ ధింగ్రా చర్యను ఈ సమావేశం ఏకగ్రీవంగా ఖండిస్తున్నది"

"లేదు. వినాయక దామోదర సావర్కార్ ఈ తీర్మానాన్ని వ్యతిరేకిస్తున్నాడు"

సగం ప్రపంచాన్ని పాలిస్తున్న ఆంగ్లేయుల రాజధాని అయిన లండన్ నగరంలో పరాయి పాలనలో, ఉన్న దేశానికి చెందిన యువకుడు ఇంత సాహసం చేస్తాడా? పామర్ అనే ఆంగ్లో ఇండియన్ దీనిని సహించ లేక పోయాడు. సావర్కార్ ముక్కుమీద ఒక గుద్దు గుద్దాడు. సావర్కార్ ముక్కు నుంచి రక్తం కారసాగింది. తిరుమలాచార్య వెంటనే లాఠీతో పామర్ తలపై బాదాడు. "హిందూ స్థానీల దండ రుచి చూడు" అన్నాడు. సభ అంతా గందరగోళం అయింది. మదన్‌లాల్ ధింగ్రా చర్యను నిరసించే ప్రయత్నం విఫలమైంది.

## 25. తల్లీ! లే! నీవుజగజ్జననివి

"జయ జయ రఘువీర సమర్థ" అనే నినాదం ముమ్మారు వినిపించింది. గృహిణి కోపంతో బయటకు వచ్చి "ఇదిగో భిక్ష తీసికో" అంటూ ఇల్లు అలుకుకునే బురదతో నిండిన గుడ్డ నెత్తి మీద కొట్టింది. సన్యాసి ఆమెను ఆశీర్వదించి ముందుకు సాగాడు. తరువాత ఆమెకు తెలిసింది ఆ వచ్చిన సన్యాసి సమర్థ రామదాస స్వామి అని. ఆమె మనస్సులో చాలా బాధ పడింది. రామ దాస స్వామి నివాసానికి వెళ్ళింది. అక్కడ అసంఖ్యాక భక్త జనంతో కూడిన స్వామి ఆ గుడ్డను ఎండబెట్టి దానితో వతులు తయారుచేసి వెలిగిస్తున్నారు.

ఆమె కళ్ళ వెంట అశ్రువులు ధారగా కారాయి. ఆయన పాదాలు పట్టుకొని క్షమాపణ కోరింది. ఆయన ఆమెను ఓదారుస్తూ "తల్లీ! లే! నీవు జగజ్జననివి. పాపం నుంచి విముక్తురాలవు. నీ అశ్రువులే చెబుతున్నవి నీవు భక్తి స్వరూపిణివని. అందరికి శుభమగు గాక!" అన్నాడు. భక్తుల నుద్దేశించి "ఈ వత్తులు ఏ విధంగా కాంతిని వ్యాపింప చేస్తున్నవో అదే విధంగా ఈ తల్లి కూడా ప్రకాశాన్ని వెదజల్లుతుంది" అన్నాడు.

## 26. కుష్ఠు రోగుల సేవకుడు, కాత్రే

"మేము కేవలం మందు మాత్రమే ఇవ్వగలం. కాని ఒక్క ఏసు మాత్రమే మిమ్మల్ని పాపం నుంచి కాపాడ గలడు. కాబట్టి ఆయనను శరణు కోరండి. రాముడు, కృష్ణుడు మిమ్మ రక్షించలేరు." అన్నారు భేతల్‌పూర్ (మ. ప్ర)లోని మిషన్ ఆస్పత్రి అధికారులు. ఈ మాటలు సదా శివ గోవింద కాత్రేకు బాధ కలిగించాయి. ఆయన "కుష్ఠు రోగాన్ని గూర్చి సమాజంలో ఉన్న తప్పుడు భావనలు కారణంగా కుష్ఠు రోగులను చూసి భయ పడుతున్నారు. తమ స్వంత బంధువుల నుంచి కూడా దూరంగా పరుగెత్తుతున్నారు. రోగికి ధైర్యం చెప్పి తగిన చికిత్స చేస్తే తప్పక నయమవుతుంది. వీరు మనుష్యులలోని బలహీనతను ఆసరాగా తీసుకొని మతాంతరీకరణ జరుపుతున్నారు. కుష్ఠు రోగులకు సేవచేసే ఆశ్రమాన్ని నిర్మిస్తాను అక్కడ మతాంతీకరణ జరుగదు" అనుకొన్నాడు.

ఈ సంకల్పంతో ఆయన పరమపూజనీయ గురూజీ వద్దకు వెళ్ళారు. ఆయన ఆశీర్వాదంతో తనకు రైల్వే నుంచి వచ్చే పెన్షన్ డబ్బుతో ఆయన మధ్య ప్రదేశ్‌లో "రామకృష్ణ సేవాశ్రమ్" స్థాపించారు. ముష్టితో పెట్టిన బియ్యాన్ని, ధర్మంగా ఇచ్చిన అయిదు, పది పైసలను పోగు చేసి ఆయన తన పూర్తి జీవితాన్ని సేవలో గడిపాడు. అనేక మంది జీవితాలను సుఖమయం చేశాడు.

## 27. వాటిపై అధికారం వారికే ఉంది

అది ప్రధాన మంత్రి ఆచార్య చాణక్యుని కుటీరం. బీదలకు పంచే నిమిత్తం సామ్రాట్ చంద్ర గుప్తుడు పంపిన దుప్పట్లు ఒక మూల పెట్టి ఉన్నాయి. ఈ విషయాన్ని తెలుసుకున్న దొంగలు రాత్రి ఆ కుటీరాన్ని చేరుకున్నారు. చాణక్యుడు,ఆయన వృద్ధ మాత నేలపైన చాప పరుచుకొని దాని పైన పాత కంబళి కప్పుకొని నిద్ర పోతున్నారు. కంబళి మధ్యలో చిల్లులు ఉన్న కారణంగా వారు చలికి వణుకుతున్నారు. ఇది చూచిన దొంగలు ఆశ్చర్యపోయారు. వారు ఆచార్యుని నిద్ర లేపారు. "క్షమించండి మేము దుప్పట్లు దొంగిలించడానికి వచ్చాము. మూల కొత్త దుప్పట్లు రాశిగా పడి ఉన్నప్పటికీ మీరు ఎందుకు ఇట్లా చలికి వణుకుతూ పడుకున్నారు? ఇందులోని రహస్యమేమిటి?" అని అడిగారు.

ఆయన చిరునవ్వుతో "ఇవి దుప్పట్లులేని బీద వారి కోసం తెచ్చినవి. వాటిపై అధికారం వారికే ఉంది. నేను వాటిని కప్పుకొంటే నేను కూడా మీవంటి దొంగనే అవుతాను." అన్నాడు. దొంగలు ఆయనను క్షమించమని కోరి తమ చోర వృత్తిని మానుతామని శపథం చేశారు. అత్యున్నత స్థానంలో ఉన్న అధికారుల ఆదర్శం మహోన్నత శిఖరాల నుంచి ప్రవహించే గంగా జలం మాదిరిగా ప్రజల మనస్సులను పవిత్రం చేస్తుంది.



## 28. దుర్గాదాస్ ఔదార్యం

"అమ్మా ఇంత వరకు నీవు విధర్మీయుల రక్షణలో జీవితాన్ని గడిపావు నీకు మన ధర్మాన్ని గురించి ఏమాత్రమూ తెలియదు. నీకు వెంటనే ఖురాను నేర్పడం ప్రారంభిస్తాను" అన్నాడు ఔరంగజేబు తన 16 సంవత్సరాల మనుమరాలు సఫీతున్నిసాతో. ఆమె తండ్రి అక్బర్ ఔరంగజేబుకు భయపడి ఇరాన్‌కు పారిపోయాడు. తన కుమార్తెను

దుర్గాదాస్ రాఠోడ్ సంరక్షణలో ఉంచాడు. కాని షహజాదీ "తాతగారు ఏమంటున్నారు? దుర్గాదాస్ బాబాయి నన్ను తన కన్న కూతురుతో సమానంగా పెంచడమే గాదు ఖురాన్ బోధించడానికి ప్రత్యేకంగా ఒకామెను నియమించాడు. నాకు ఖురాన్ అంతా కంఠస్థం. అనుమానంగా ఉంటే, అడగండి" అన్నది.

ఔరంగజేబు ఆశ్చర్యంగా ఆమె వంకే చూస్తుండి పోయాడు. ఔరంగజేబు ఆదర పూర్వకంగా "దుర్గాదాస్ నీవు ధరిస్తావు. భగవంతునికి ప్రీతి పాత్రుడవయిన పుత్రుడవు. మా అమ్మాయికి మా ధర్మాన్ని నేర్పి ప్రశంశార్హుడవైనావు." అన్నాడు.

దుర్గాదాస్ వినయంగా పాదుషా ఇందులో నన్ను ప్రశంసించవలసిందేమీ లేదు. మా జీవనంలో మానవత్వాన్ని ప్రవహింప చేస్తున్న మహోన్నతమైన ధర్మము, సంస్కృతులకే గొప్పతనం చెందుతుంది మీరు వాటిని గౌరవించండి." అన్నాడు.

## 29. దేశభక్త యువకుని ఆకాంక్ష

అది ఆగస్టు 1942. ఆంగ్ల సేనల వలయాన్ని ఛేదించి ప్రభుత్వ కార్యాలయం మీద రాష్ట్ర ధ్వజాన్ని ఎగురవేయ సంకల్పించారు ఏడుగురు యువకులు. కాని విదేశీ ప్రభుత్వం క్రూరంగా వారిపై తుపాకీ గుళ్ళ వర్షం కురిపించింది. ఒకరి తరువాత ఒకరు ఆ ఏడుగురు వీరులు నేల కూలారు. పడిపోతునే వారు దిక్కులు పిక్కటిల్లేటట్లు నినాదాలు చేశారు, "ఆంగ్లేయులారా భారత దేశాన్ని విడిచి వెళ్ళండి." "హిందుస్తాన్ మాదేనోయ్" రాష్ట్ర ధ్వజానికి వందనం చేస్తూ ఆరుగురు అక్కడికక్కడే మరణించారు.

మిగిలిన యువకుని ఆస్పత్రికి తరలించారు. ఆపరేషన్ బల్ల మీద పడుకో బెట్టారు. ఆ యువకుడు డాక్టర్‌తో "డాక్టరు గారూ, ఇంగ్లీషు

వాళ్ళ తుపాకీ గుండు ఏదీ నా వీపుకు తగలలేదు కదా?" అని అడిగాడు. లేదని సమాధానం చెప్పడంతోనే అతని ముఖ మండలం ప్రకాశవంత మైంది. మరుక్షణమే అతని ప్రాణాలు అనంత విశ్వంలో కలిసిపోయాయి. ఆ యువకుని పేరు ఉమాకాంత ప్రసాద్ సింహ. సారణ జిల్లాలోని నరేంద్రపూర్‌కు చెందిన వాడు.

## 30. విప్లవకారునికి విశ్రాంతి అంటూ లేదు

విప్లవవీరుడు నారాయణదాస్ ఖారేటీకాగఢ్ సంస్థానంలోని దళిత వర్గాల ప్రజల కష్టాలను చాటి చెబుతుండేవాడు. జమీందారులు చేసే అన్యాయాలను ఎదుర్కొంటుండేవాడు. ఒక రోజున జమీందారులు దాడి జరప సంకల్పించారు. ఈ రోజు వెళ్ళవద్దని అతని అనుచరులు ఎంత గానో నచ్చచెప్పారు. ప్రాణాపాయమున్నది. "ఇవేళ ఆగినంత మాత్రాన జరిగేదేమున్నది? నేను జీవితాంతం వరకు చేయాల్సిన పనే అటువంటిది. అన్యాయానికి విరుద్ధంగా చివరివరకు పోరాటం జరుపవలసిందే"అన్నాడు. శ్రీ ఖారే. తన డొక్కు సైకిలుమీద బయలుదేరాడు. దారిలో జమీందారుల గూండాలు పెద్ద సంఖ్యలో కాచుకొని ఉన్నారు. వారు ఆ విప్లవవీరుని ముక్కలుముక్కలుగా నరికేసారు. నారాయణదాస్ ఏ మట్టిలో పుట్టాడో అందులోనే కలిసిపోయాడు కాని ఆయన మాటలు నేటికీ మన చెవుల్లో మార్మోగుతుంటాయి. "విప్లవకారునికి విశ్రాంతిఅంటూలేదు. నిరంతరం ముందుకు సాగుతుండేవాడే నిజమైన బాటసారి. అతడు చివరకు విశ్రాంతి తీసుకొనేది మాతృభూమి ఒడిలో"

## 31. నేను డబ్బేం చేసుకొంటాను

రామావతార్ పరదేశి కుష్ఠురోగి. ఆయనకు ఒకే కన్ను ఉంది. తన కున్న ఎకరం పొలంలో కూరగాయలు పండించి తన జీవనం గడుపు

తున్నాడు. ఆదనంగా మిగిలినదానిని ఆశ్రమవాసుల కోసం ఇచ్చేవాడు. కుష్టురోగం నుంచి విముక్తులైన ఒక జంట వివాహసందర్భంగా, రోగులకు వికలాంగులకు విశిష్టమైన సేవ చేసినవారిని సన్మానించడం కోసం ఒక సభ జరిపారు. ఆ సభకు మహారాష్ట్ర విధానసభ అధ్యక్షుడు అధ్యక్షత వహించాడు. అక్కడ శ్రీ పరదేశికి ఇచ్చిన బహుమానంలో రు. 160లు నగదు ఉన్నది. కాని ఆయన వేదికమీదకువచ్చి వినయంగా "ఈధనాన్ని విదర్భ మహారోగి సేవామండలికి నేను ఇచ్చే అల్పమైన కానుకగా స్వీకరించండి. నేను దబ్బేం చేసుకొంటాను? పీడిత జనసేవతో కాలం గడుపుతున్నాను. మీరు నా మంచి చెడు చూస్తున్నారు. చివరిదాకాచూస్తుంటారు. నా కొద్దిపాటి అవసరాలకు నాకున్న తోట చాలు. ఇదే నాపూజ" అన్నాడు.

మానవతా పుష్పం సాధన సంపత్తు : అంబరంలో వికసించదు. అది సమాజంలో అట్టడుగున ఉన్నవారి హృదయాలలోనే వికసిస్తుంది.

## 32. ఇప్పుడు నా అంతిమ యాత్ర సుఖంగా సాగుతుంది

శ్రీ నీలమాధవ బందోపాధ్యాయ బెంగాలులోనిసుప్రసిద్ధ న్యాయాధికారి. ఆయన న్యాయానికి పెట్టిన పేరు. మరణశయ్యమీద బాధపడుతున్నాడు. ఆయన హఠాత్తుగా "భీమా కంపెనీ ఉద్యోగులను పిలవండి" అన్నాడు. భీమా కంపెనీ ఏజెంటు రాగానే ఆయన "నా భీమాను రద్దు చేయండి. అయిదు సంవత్సరాల క్రితం అయిదువేల రూపాయలకు భీమా చేసాను. అప్పుడు డాక్టరుతో నా ఆరోగ్యం బాగానే ఉన్నదని చెప్పాను. కాని వాస్తవానికి అప్పటికే నాకు మధుమేహం ఉన్నది. అప్పుడు చెప్పిన అబద్ధం నన్ను నేటికీ బాధిస్తూనే ఉన్నది. అనేక సంవత్సరాలు న్యాయాధిపతిగా సత్యానికి పెట్టినపేరుగా ఉన్నాను. కాని వ్యక్తిగత జీవితంలో

అబద్దాలు చెప్పాను. నేడు సర్వోన్నతుడైన న్యాయాధీశుని ముందుకు పోతున్నాను. ఈ పాపం నన్ను బాధిస్తోంది. నా భీమాను రద్దు చేయండి నా వారసులకు తప్పుడు పద్ధతుల ద్వారా ధనం లభించరాదు. ఆ ధనం పీద వారికి అధికారం లేదు" అన్నాడు.

భీమా కంపెనీ ఏజెంటుకు ఆశ్చర్యం వేసింది. "సాధారణంగా అందరూ అట్లానే చేస్తుంటారు." అందుకు నీలమాధవబాబు "ఇతరులకు న్యాయం చేయడం గొప్ప విషయం. కాని స్వార్థాన్ని త్యజించి స్వంత విషయంలో కూడా న్యాయంగా వ్యవహరించడమే సత్యసంధతకునిజమైన పరీక్ష. ఆఖరి ఘడియలలో నాలో వివేకంకలిగి న్యాయస్థాపన చేయగలుగు తున్నందుకు సంతోషంగా ఉంది. ఇప్పుడు నా అంతిమయాత్ర సుఖంగా సాగుతుంది."

## 33. పవిత్ర భాగీరథి ప్రవహించే దేశంలో ఏ ఒక్క యాత్రికుడు దాహంతో బాధపడరాదు!

"అమ్మా! మంచి నీళ్ళివ్వు. గొంతెండిపోతోంది'' అని ఒక చిన్న పిల్ల అరుస్తోంది అది డెహ్రాడూన్ ఎక్స్‌ప్రెస్. పెట్టెఅంతా ప్రయాణీకులు క్రిక్కిరిసి ఉన్నారు. ప్రక్కనే ప్లాట్‌ఫారంమీద శ్రీ సాధురామ్‌జీ నిలబడి ఉన్నారు. ఆయన సింధీ సమాజానికి అధ్యక్షుడు. ఒకపెద్దపుస్తకాలషాపు యజమాని. ఆయన ఒక గ్లాసుతో నీళ్ళు తెచ్చేందుకు పరుగెత్తాడు. రైలు ఎవరికోసం ఆగుతుంది. అది వెళ్ళిపోయింది. ఆయన ఎంతో బాధ పడ్డాడు. గ్లాసులో ఉన్న గంగాజలం సాక్షిగా ప్రతిజ్ఞ చేశాడు. "పవిత్ర భాగీరథి ప్రవహించే దేశంలో ఏ ఒక్క యాత్రికుడు దాహంతో బాధ పడరాదు."

మరుసటి రోజు నుంచి చేతిలో నీళ్ళ బకెట్టు, గ్లాసుతో ప్లాటుఫారం మీద సిద్ధంగా ఉన్నాడు. రైలు ఆగినప్పుడల్లా ప్రయాణీకులకు నీళ్ళు ఇవ్వసాగాడు. ఇది చూసి అనేకమంది ఉత్సాహవంతులైన కార్యకర్తలు ముందుకు వచ్చారు. క్రమంగా వారిసంఖ్య పెరిగింది. నేటికికూడా అనేక మంది ఎండాకాలంలో ఈ విధమైన సేవచేయడంలో నిమగ్నులై ఉన్నారు. ఢిల్లీ, బొంబాయి, రత్లాం వెళ్ళే ఏ ప్రయాణీకుడైనా అడగండి. చల్లటినీరు భవానీ మండిలో దొరుకుతాయని చెబుతాడు.

## 34. నిజమైన వీరుడు హడావిడి చేయడు

ఒకసారి ఆల్మోరా రాజు తన రాజ్యాన్ని దురాక్రమణదారులనుంచి రక్షించుకోవడంకోసం ఒక కొత్త సైనిక దళాన్ని రూపొందించదలచాడు. అందుకు ఎంపిక చేసిన ప్రతి యువకునికి ఒక నూతన ఖడ్గం ఇచ్చారు. తరవాత రాజు "ముందుకు నడవండి" అని ఆజ్ఞాపించాడు. వెంటనే అందరూ కత్తులు దూసి నినాదాలు చేయసాగారు. 'రాజు ఏమిచేస్తున్నారు' అని అడిగాడు. "మేము నిరంతరం సన్నద్ధులుగాఉంటున్నాము. శత్రువు ఆకస్మికంగా మనపై దాడి చేయలేడు" అన్నారు. రాజు "మీరంతా ఇళ్ళకు పొండి. మీరంతా పిరికివారు. ఊరకే ఉద్రేకపడేవారు నాకు పనికి రారు. నిజమైనవీరుడు హడావుడి చేయడు. ఎప్పుడూ యుద్ధాన్ని గూర్చే ఆలోచించడు."అన్నాడు.

## 35. నీ సమదర్శనం కొనియాడదగింది

రాజారంతిదేవ్ తన సర్వస్వాన్ని దానం చేసి అరణ్యంలో ఆశ్రమ వాసం గడపసాగాడు. ఒకసారి ఉపవాసానంతరం ఆయన కోసం పాయసం తయారుచేసారు. అప్పుడే ఒక బీద బ్రాహ్మణుడు అక్కడికి వచ్చి అన్నం పెట్టమని అడిగాడు. రంతిదేవుడు సగం భోజనాన్ని

బ్రాహ్మణునికి ఇచ్చాడు. తరువాత ఒక శూద్రుడు వచ్చాడు. అతనికి సగం పెట్టాడు. ఇంతలో ఒక కుక్క అక్కడికి వచ్చింది. మిగిలింది దానికి పెట్టాడు. చివరకు ఒక ఛండాలుడు వచ్చి భిక్ష అడిగాడు. రాజు మిగిలి ఉన్న పాలను అతనికి పోసాడు. తాను ఆహారం లేకుండానే ఉన్నాడు. అప్పుడు నలుగురు దేవతలు ఆయన ముందు ప్రత్యక్షమై "రాజా ! మేము బ్రాహ్మణుడు, శూద్రుడు, కుక్క, ఛండాలుడు రూపాలలో నీ వద్దకు వచ్చాము. నీవు అందరినీ సమానంగా ఆదరించావు. నీ సమదర్శిత్వం కొనియాడ తగింది" అన్నారు.

## 36. పట్టు విడవని రాజేంద్రప్రసాద్

పరీక్షా ఫలితాలను ప్రధానాచార్యుడు చదువుతున్నాడు. పేర్లన్నీ చదవడం పూర్తి అయినాక ఒక విద్యార్థి లేచి "నా పేరు చదవలేదండి" అన్నాడు. ఉపాధ్యాయుడు "నీవు తప్పావు" అని సమాధానం చెప్పాడు. ఆ సంవత్సరం ఆ బాలుడు చాలా రోజులు మలేరియా జ్వరంతో బాధ పడ్డాడు. అయినా అతనికి తాను పాసయి తీరతాననే నమ్మకం ఉంది.

"అట్లా జరగడానికి వీలులేదు" అన్నాడు.

"అంతే నువ్వు తప్పావు" అన్నాడు ఉపాధ్యాయుడు గట్టిగా,

"కాదు అట్లా జరగదు"

"మాట్లాడకుండా కూర్చో, అరిచావంటే ఫైన్ వేస్తాను"

"నేను పాస్ అయినాను, అనుమానం లేదు" అన్నాడు విద్యార్థి

"అయిదు రూపాయలు ఫైన్ కట్టు"

"ఏమైనా నేను పాస్ అయినాను"

"పది రూపాయలు"

ఈ విధంగా వారు పట్టుదలతో వాదించారు. జుల్మానా 50 రూ॥లకు పెరిగింది. ఇంతలో గుమాస్తా పరుగెత్తుకొంటూ వచ్చాడు. విద్యార్థిని

కూర్చోమని చెప్పాడు. తరువాత తేలిందేమంటే ఆవిద్యార్థికి అందరికంటె ఎక్కువ మార్కులు వచ్చాయి. ఆయననే రాజేంద్రప్రసాద్, ప్రథమ భారత రాష్ట్రపతి.

## 37. పీష్వామాధవరావు ఔదార్యం

ప్రధాన న్యాయమూర్తి తన పల్లకిని ఆపించి, దిగి పొలంలోకి వెళ్ళాడు. అక్కడ సిపాయిలు ఒక రైతును కొడుతున్నారు. వృద్ధురాలైన అతని తల్లి తిడుతున్నది. విచారించగా సిపాయిలు కొందరు రైతులను ప్రభుత్వం పనిమీద పట్టుకొని పోతున్నారని తెలిసింది. ఆ రైతు ఆమెకున్న ఒకేకొడుకు, అతడు వెళ్ళిపోతే ఆమెకు దిక్కెవరు ? రామశాస్త్రి సిపాయిల అధికారితో "ఇతనితోబాటు మిగిలినరైతులను కూడా వదిలిపెట్టు" అన్నాడు అధికారి ఒప్పుకోలేదు. ప్రభుత్వ కార్యానికి అంతరాయం కలిగించినందుకు ఆయనను కూడా పట్టుకొని పోయారు.

రాజాజ్ఞను ధిక్కరించినందుకు పీష్వా మాధవరావుకు కోపం వచ్చింది. "ఈ తప్పుకు మిమ్మల్ని కూడా శిక్షించవలసి ఉంటుంది" అన్నాడు. రామశాస్త్రి "నన్ను దండించవలసి ఉన్నట్లయితే నా విన్నపాన్ని కూడా వినండి. మేము మీ ప్రజలము, మీ ఆజ్ఞ పాటించడం మా కర్తవ్యము. అయితే ప్రజలలో ఎవరు ఎక్కడ ఉండడం లాభదాయకమో ఆలోచించవలసి యున్నది. రైతులు పంటను కోయకుండా వెట్టిచాకిరికి పోతే పంట నష్టమవుతుంది. ఆ నష్టాన్ని ప్రజలు, ఆఖరుకు ప్రభుత్వం కూడా భరించవలసి ఉంటుంది. వారు మీకు ఎంతగా విధేయులో తెలుసుకోగోరుతున్నారనుకొంటాను" అంటూ రైతులవైపు తిరిగి "ప్రభుత్వ కార్యం కోసం పిలిస్తే మీరు వస్తారా ? " అని ప్రశ్నించాడు. "తప్పక వస్తాము. మా ప్రాణాలనైనా ఇస్తాము" అన్నారు.

పీష్వా మాధవరావు అర్థం చేసుకున్నాడు. "వీరందరినీ వదలి పెట్టండి. పొలం పనులు పూర్తి అయ్యేంతవరకు ఎవ్వరినీ బలవంతంగా తేవద్దు" అన్నాడు. కొన్ని రోజులకు వెట్టిచాకిరి పూర్తిగా రద్దయింది.

## 38. ఆయన తలపాగా కూడ తలవంచదు

"నీవు వందిమాగధుడవైనప్పటికీ సభా మర్యాద తెలియని వాడి వలె ఉన్నావు. రాజస్థాన్‌కు చెందిన వందిమాగధులు మంచి పండితులని, వారు ఆస్థాన కవులుగా ఉంటారని, మంచి నైపుణ్యంతో సభాకార్యకలాపాలను నిర్వహించగలరని వినియున్నాను. నీవు చదువుకోనివాడవైనా కావాలి లేదా మంచి వాడవైనా కాకపోవాలి" అన్నాడు అక్బర్ తనని చూడడానికి వచ్చిన వందిమాగధునితో.

అందుకు "మహారాజా ! మీరు ఏమైనా చెప్పవచ్చు. తమకు అభివాదం చేయకపోడానికి కారణం నేను చదువుకోనివాడనవడం కాదు. నేను మంచివాడను కాకపోవడం కాదు. తెలిసేచేశాను." అక్బర్ ఆశ్చర్యంతో "అట్లా ఎందుకు చేశావు ? " అని అడిగాడు.

"మహాప్రభో ! నా దుష్ప్రవర్తనను మన్నించండి. మీకు నమస్కరించకుండా ఉండే ధైర్యమూ నాకు లేదు. కాని నా తలపైన ఉన్న తలపాగా మే వాడ్ మహారాణాది. ఆయన ఆదరంతో నాకు ఇచ్చాడు. మహారాణా ప్రతాప్ నేటి వరకు శత్రువుల ముందు తల వంచలేదు. ఆయన తలపాగాను మీముందు వంచే అధికారం నాకెక్కడిది ? నేను దానిని చేతిలో ఉంచుకొని మీ ముందు తలవంచుతాను" అంటూ శీతల్ ఆ విధంగానే చేసాడు.

## 39. శ్రీమాత సంకల్ప శక్తి

ఈ శతాబ్దం మొదట్లో శ్రీమాత ఆల్జీరియాలోని క్లెమ్‌సెన్ నగరానికివెళ్ళింది. అక్కడి ప్రసిద్ధ తాంత్రికుడైన తేవో వద్ద రహస్య విద్యను

అభ్యసించింది. అక్కడ భరింపరాని వేడి. ఒక మిట్ట మధ్యాహ్నం చెట్టు కింద ధ్యానంలో కూర్చొని ఉండగా ఆమెకు ఉన్నట్టుండి కొంత ఇబ్బంది కలిగింది. కళ్ళు తెరచి చూస్తే ఎదురుగా బుసలు కొడుతున్న విష సర్పం కనిపించింది. దానికెందుకు కోపం వచ్చిందో ఆమెకు అర్థం కాలేదు. తాను పాము పుట్ట మీద కూర్చొన్నట్లు తెలుసుకొన్నది. ఏమాత్రం కదిలినా అది కాటు వేస్తుంది. నేను భయపడకుండా దానివైపే చూస్తూ నా సంకల్ప శక్తిని ప్రయోగించాను. కొద్దిసేపట్లో దాని బుస ఆగి పోయింది. అది తల వంచింది. సమీపంలోని చెరువులోనికి పోయింది"

## 40. మెషిన్ మెన్ పని మేనేజింగ్ డైరెక్టరు పని కంటె తక్కువకాదు.

ఒక రోజు ప్రెస్సులో హటాత్తుగా విద్యుత్తు ప్రసారం ఆగి పోయింది. మొదటి పేజీలో 'నేడు విద్యుత్ ప్రసారానికి అంతరాయం కలిగినందువల్ల వార్తాపత్రిక ఆలస్యంగా వెలువడ్డది' అని ఒక వాక్యం రాస్తే సరిపోతుంది. కాని అటువంటి సమయంలో కూడా పండిత దీన దయాళ్ ఉపాధ్యాయ ఉత్సాహాన్ని ప్రదర్శించారు. ఆయన చేతులుముడుచు కొని కూర్చోలేదు. ముద్రణాలయాన్ని చేరుకొన్నారు. తానే స్వయంగా యంత్రాన్ని నడిపారు. పత్రిక ముద్రణ ఆగడానికి వీలులేదన్నారు. ఉప దేశాలు ఇవ్వవలసిన అవసరంలేదు. ఆచరించి చూపాలి. మెషిన్ మేన్ పని మేనేజింగ్ డైరెక్టర్ పని కంటె ఏ విధంగానూ తక్కువ కాదు. కాయ కష్టం చేయడం దైవీయమైనదని నినాదాలు చేస్తారే కాని విద్యాలయాలలో దేవ మనకు కనిపించదు.

## 41. "ఇప్పుడు నీవంటి కొడుకులనేక మంది ఉన్నారు"

మంగళ్‌ని రక్షించాలి. అతను నిరపరాధి అని నిరూపించాలి. మన నరసంఘచాలక్ 12-14 ఏళ్ళవాడుగా ఉన్నప్పుడు మంగళ్ 10-12 మంది అల్లరి పిల్లరిగా తిరిగే బృందంలో సభ్యుడుగా ఉండేవాడు. గోండు తెగకు చెందిన మంగళ్ బీదవాడు, సరళస్వభావుడు. తాగివచ్చిన పొరుగువాని బారినుండి తండ్రిని రక్షించే ప్రయత్నంలో ఆ తాగుబోతును ఎత్తి పడవేసాడు. అతడు అక్కడికక్కడే మరణించాడు. మంగళ్ వంటి స్నేహపాత్రునికి సహాయం చేయడానికి అతని బృందమంతా సిద్ధమైంది.

అందరు డబ్బు, ఆహార పదార్థాలు, గుడ్డలు పోగుచేసి మంగళ్ ఇంటికి తీసుకొని వెళ్ళారు. అప్పటికే అతను జైలులో ఉన్నాడు. ఆ తల్లిదండ్రులకు వీరంతా పిల్లలయినారు. వారు మంగళ్‌కు హామీ ఇచ్చారు "మీ అమ్మనాన్నకు ఎటువంటి లోటు రానివ్వము. నీకు కూడా ఏ ఇబ్బందీ లేకుండా చూస్తాము."

మంగళ్ పైన చాల సంవత్సరాలు కేసు నడిచింది. ఆయన పైన హత్యకేసు మాత్రము పెట్టలేదు. మామూలు శిక్ష పడింది. స్నేహితులంతా సంతోషించారు. మంగళ్ విడుదలై వచ్చిన నాడు అతని తల్లిదండ్రుల ఆనందానికి మేరలేదు. "ఇంతవరకు మాకు ఒక్కడే కొడుకున్నాడు. ఇప్పుడు నీవంటి కొడుకులు అనేక మంది ఉన్నారు.

## 42. విశ్వాస గుణం

భైసాసాహ్ అనే జైన వ్యాపారి ఉండేవాడు. అతడు మిక్కిలి ధనవంతుడు. అతడు ఎంత ధనవంతుడో అంత నమ్మకస్తుడు. ఆయన

పేరు నలుమూలలా వ్యాపించింది. వ్యాపారస్తులందరిలోకి ఆయనకు మంచి పేరున్నది. ఒకసారి ఆయన అహమ్మదాబాదుకు వెళ్ళారు. డబ్బు అవసరమైంది. బజారుకు వెళ్ళాడు. ఒక వ్యాపారస్తునితో "నాకు లక్ష రూపాయలు కావాలి" అని అడిగాడు. అతడు మీరెవ్వరని అడిగాడు. ప్రక్కనే ఉన్న స్నేహితుడు "ఈయన భైసాసాహ్" అని పరిచయం చేసాడు వ్యాపారస్తుడు "మీరేమి కుదువబెట్ట దలచారు ? " అని ప్రశ్నించాడు. భైసాసాహ్ తన తల వెంట్రుకను తీసి "దీనిని తీసుకొని మీ అంగడిలో పెట్టు" అన్నాడు. ఆయనకున్న పేరు ప్రతిష్టలు అటువంటివి. వ్యాపారస్తుడు లక్ష రూపాయలు ఇచ్చాడు. భైసాసాహ్ డబ్బు తీసుకొని వెళ్ళిపోయాడు! గడువుకంటె ముందుగానే ఆయన డబ్బు పంపించి తన వెంట్రుకను తిరిగి తీసుకొన్నాడు. ఆ రోజుల్లో డబ్బుకంటె మాటకు విలువ ఎక్కువ.

## 43. న్యాయదీక్ష

ఓర్చా (మ. ప్ర.) మహారాజు కత్తి దూసి నిలబడివున్నాడు. ఆయన బందీగా ఉన్న రాజకుమారునితో "ప్రవీరరాయ్ ! నీవు సన్యాసిని హత్య చేసావా ? " అని ప్రశ్నించాడు. ప్రవీరరాయ్ గట్టిగా "హత్యచేయ లేదు. నా వేటకు అంతరాయం కలిగించిన బాబా దుడుకుతనానికి శిక్ష విధించాను" అన్నాడు. ప్రధాన మంత్రి ఇతర మంత్రులు రాజకుమారునికి కఠినమైన శిక్ష విధించ వద్దని ప్రార్థించారు. అతడు కాబోయే రాజని గుర్తుచేసారు.

"ప్రజలకు అత్యంత గౌరవ పాత్రుడైన సంత్‌ను హత్య చేసేటంతటి దుర్మార్గుడు సింహాసనానికి వారసుడు కానేరడు. ప్రజలను సమదృష్టితో సుఖంగా ఉండేటట్లు చూడాలనే నియమం పుత్రవ్యామోహానికి లొంగి

పోయేది కాదు " అంటూ మహారాజు వీరసింహ పుత్రుని శిరస్సును ఒకే వేటుతో ఖండించాడు. సభనుంచి వెళ్ళిపోతూ "దుర్మార్గుడైన యువరాజును చంపినంత మాత్రాన సింహాసనానికి వారసుడే లేకుండా పోతాడా? ఓర్చాలో ప్రతి యువకుడూ రాజపుత్రుడే. వారిలో ప్రతి ఒక్కరిలోనూ సింహాసనాన్ని అధిష్టించే సామర్థ్యం ఉన్నది. " అన్నాడు. ఇటువంటి న్యాయదీక్ష కారణంగానే ఓర్చా రాజ్యం శత్రువులకు కన్నెత్తి చూడరానిదైంది.

## 44. సమయ పాలన

సర్ చంద్రశేఖర వెంకటరామన్ ఒక సభలో మాట్లాడవలసి ఉన్నది. దానికి మైసూర్ ప్రభుత్వంలోని ఒక ఉన్నతోద్యోగి అధ్యక్షత వహిస్తున్నాడు. ఆరు గంటలకు సభ ప్రారంభం కావలసి యున్నది రామన్ పది నిముషముల ముందు వచ్చి వేదికపై కూర్చొన్నారు. అధ్యక్షుడి జాడలేదు. కొద్దిసేపట్లోనే ఆరు గంటలైంది. సభా నిర్వాహకుల ముఖాలలో ఆదుర్దా కనుపిస్తోంది.

రామన్ కొద్ది నిమిషాలు ఎదురు చూసి "ఇంతవరకూ కనుపించని అధ్యక్ష మహాశయా'' అంటూ ఖాళీ కుర్చీ వైపు చూసి తన ప్రసంగాన్ని ప్రారంభించాడు. చాలసేపటి తరువాత అధ్యక్షులవారు వచ్చారు. మాట్లాడకుండా తమ కుర్చీలో కూర్చొన్నారు. డా. రామన్ సమయ పాలన అంతటి కఠోరమైనది. ఆయన ఎవరి ముందు తల వంచే వాడు కాదు.

## 45. కుల భేదం

ఒక వ్యక్తి స్వామి రామానుజులతో "అగ్రకులంలో జన్మించిన మీరు ఒక అంత్యజునికి (హరిజనుడికి) అంత్యక్రియలు చేసారు'' అని

ఇంకా ఏదో చెప్పబోతున్నాడు. మధ్యలోనే ఆపి రామానుజులు "సాక్షాత్తు భగవంతుని అవతారమైన శ్రీరామచంద్రుడు ఒక పక్షికి (జటాయువు) దహన సంస్కారాలు చేయలేదా ? ఈ హరిజనుడు పక్షితో సమానమైన అల్పుడూ కాడు. నేను రాముని వంటి మహా పురుషుణ్ణి కాను'' అన్నాడు.

## 46. యతీంద్రనాథ్ ఔదార్యం

ఎండా కాలం మిట్ట మధ్యాహ్నం. కలకత్తాలో రోడ్డుమీద పెద్ద గుంపు చేరారు. ఏమి జరిగిందో చూద్దామని ప్రఖ్యాత విప్లవకారుడు యతీంద్రనాథ్ అందులో దూరాడు. ఒక్కచిక్కిన ఒక వృద్ధురాలు ఎండ దెబ్బకు పడిపోయింది. అందరూ మాటలలో సానుభూతి చూపేవారే. దుఃఖంలో ఉన్న ప్రతి స్త్రీని భారత మాతగాచూసే యతీంద్రుడు ధైర్యం చెబుతూ ఆమె మూటను నెత్తిన పెట్టుకొని ''ఇంటికి పోదాం రా తల్లీ'' అంటూ బయలుదేరాడు.

ఇంటికి చేరాక "అమ్మా ! నీ కెవ్వరు లేరా? '' అని ప్రశ్నించాడు. ఆమె గద్గద స్వరంతో ''ఒక్క కొడుకుండేవాడు అతడు ప్లేగు వచ్చి మరణించాడు. ఇప్పుడు మూటలు మోసి జీవిస్తున్నాను'' అన్నది. "అమ్మా నీ కొడుకు బతికే ఉన్నాడు. నేను నీ కొడుకునే ''అంటూ ఆమెకు నమస్కరించాడు. ఆమెకు కొంత డబ్బు ఇస్తూ ''అమ్మా ఇంక నీకు జీవితాంతం కష్టం ఉండదు. నీవు బరువును మోయనక్కరలేదు. '' అన్నాడు. ఆమె జీవించి ఉన్నంత కాలం నెల నెలా డబ్బు పంపుతూ వచ్చాడు.

## 47, బాల స్వయంసేవకుని దీక్ష

"గణపయ్యా వచ్చేఏడు రావయ్య"అనే నినాదం నలుపైపులా ప్రతిధ్వనిస్తోంది. అది కోల్హాపూర్. 1945 అనంత చతుర్దశినాడు ప్రతి ఉపశాఖ

గణపతి స్థాపన చేశారు. ఆ రోజు నిమజ్జనం జరుగుతోంది. సంఘ ఘోష్‌తోబాటు ఊరేగింపు సాగుతోంది. చక్కని అనుశాసనంతో నడుస్తున్న ఆ ఊరేగింపును చూసి కొందరికి కంటక ప్రాయమైంది. ఈర్షాళువులైన కొందరు ఇంటికి తిరిగి వస్తున్న ముగ్గురు బాల స్వయంసేవకులను ఒక సందులో అటకాయించారు. సంఘానికి పోవడం మానమని దబాయించారు. ఇద్దరు స్వయం సేవకులు వారి బారి నుంచి ఎట్లాగో తప్పించుకున్నారు. పన్నెండేళ్ళ చిమణ అస్టేకర్ వారి చేతుల్లోనే ఉండి పోయాడు. వారు ఆ బాలుని అనేక విధాలుగా బాధించారు. కాని చిమణ ధైర్యంగా దానినంతా సహించాడు. అతని పట్టుదల చూచి వారి కోపం మరింత ఎక్కువైంది. ఆ చిన్నారి బాలుణ్ణి ఇనుప కడ్డీతో కొట్టి చంపారు. తాను నమ్మిన ఆదర్శం కోసం పసివాడు జీవితాన్ని త్యాగం చేశాడు.

## 48. కర్తవ్య నిష్ఠ

తన కుమారుడు నీరజ మోహన్ పరీక్షలో ఉత్తీర్ణుడైనాడని టెలిగ్రామ్ ద్వారా తెలిసికొన్న విరజాబాబు ఆనందించాడు. ఆ సమయంలో ఇంట్లో ఉన్న స్వయం సేవకులందరికి మిఠాయి పంచిపెట్టాడు. అందరు ఆనందంతో ఉన్నారు. ఇంతలో ఇంకొక టెలిగ్రాం వచ్చింది. నీరజ మోహన్ హత్య చేయబడ్డాడు? ఒక్క సారిగా అంతటా నిశ్శబ్దం ఆవరించింది.

1950లో విరజాబాబు తన సర్వస్వాన్ని పోగొట్టుకొని తూర్పు బెంగాలులోని రంగపూర్ నుంచి వచ్చి సిలిగురిలో స్థిరపడ్డాడు. ప్రభుత్వం యిచ్చిన మూడు వేల రూపాయలతో ఒక చిన్న ఇల్లు నిర్మించుకొని ఉంటున్నారు. కుటుంబం పెద్దది. న్యాయవాద వృత్తిలో ఎట్లాగో ఇల్లు గడుపుతూ డార్జిలింగ్ జిల్లా జనసంఘ్ కార్యదర్శిగా ఉన్నారు. ఆయన కుమారుడు నీరజమోహన్ మెట్రిక్యులేషన్ పరీక్షలో

ఉత్తీర్ణుడైన తరువాత మధ్యప్రదేశ్‌లోని అసిస్టెంటు స్టేషన్ మాస్టర్ల అసోసియేషన్‌కు కార్యదర్శిగా ఎన్నికైనాడు. అటల్ బిహారి వాజ్‌పాయిని అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. ప్రత్యర్థి పర్టానికి చెందిన వారు నీరజ మోహన్‌ను హత్య చేశారు.

విధివశాత్తు ఆదే రోజు సాయంత్రం సిల్‌గురిలో జనసంఘ్ ఆధ్వర్యంలో జరిగే సభలో శ్రీ అటల్‌జీ ఉపన్యసించ వలసి ఉంది. పుత్రశోకంలో మునిగి ఉన్న విరజాబాబు సభకు వస్తాడని ఎవరూ అనుకో లేదు. కాని ఆయన వచ్చారు. కార్యక్రమం చక్కగా జరగటానికి తోడ్పడ్డాడు.

సభ అంతా పూర్తి అయిన తరువాత అక్కడి వారిలో ఒకరు "మీరు రాకపోయినా ఏమీ ఇబ్బంది ఉండేది కాదు" అందుకు విరజాబాబు "నా కుడి చేయి పడిపోయిన మాట నిజమే, ఆ బాధ పోయేది కాదు. అయినప్పటికీ వ్యక్తిగత ఇబ్బందుల కారణంగా సార్వజనికమైన బాధ్యతను ఎట్లా విస్మరించేది?" అన్నారు. ఆయన కర్తవ్య నిష్ఠ ప్రశంసనీయం.

## 49. అనుభవం

బాగా జీవిస్తున్న పెద్ద మనిషిని ఒకాయన అడిగాడు. 'మీ విజయ రహస్యం ఏమిటి?"

"సరియైన నిర్ణయాలు చేయడం" సమాధానం చెప్పాడు.

"సరియైన నిర్ణయాలు ఎట్లా చేస్తారు?"

"అనుభవం ఆధారంగా చేస్తాను"

"మీకు అనుభవం ఎట్లా వస్తుంది?"

తప్పు నిర్ణయాలు చేయడం ద్వారా"

## 50. భక్త కబీరు

ఒకసారి కబీర్ గంగా నదిలో స్నానం చేస్తున్నాడు. నలుగురు బ్రాహ్మణులు స్నానం కోసం అక్కడికి వచ్చారు. కాని వారి వద్ద చెంబు లేదు. కబీర్ తన చెంబును బాగా తోమి నదీ జలంతో కడిగి "మీరు ఈ చెంబును తీసుకోండి" అన్నారు.

ఆ బ్రాహ్మణులలో ఒకడు "నీవు సాలె వాడవు. నీ చెంబుతో మేము ఎట్లా స్నానం చేస్తాం" అన్నాడు.

అందుకు కబీర్ "నేను దీనిని గంగా తీరంలోని ఇసుకతో తోమాను. గంగా జలంతో కడిగాను. స్వామీ అటువంటి పాత్ర అపవిత్రం ఎట్లా అవుతుంది?" అన్నాడు.

బ్రాహ్మణుడు "తోమిన తరువాత కూడా దానిని ముట్టుకొన్నావు కదా?"

"అట్లాగైతే గంగా జలం కూడా అపవిత్రమైంది. నేను ఇందాకే అందులో స్నానం చేశాను. మీ కోసం మరొక గంగాను తీసుకొని రావలసింది." అన్నాడు.

కబీర్ మాటలకు బ్రాహ్మణులు తలలు వంచుకున్నారు.

## 51. శ్రమ విలువ

చెట్లకు నీరు పోస్తున్న ఒక సాధారణ వ్యక్తితో ఒక సంస్కృత పండితుడు "నేను మహాత్మాజీని కలుసుకోవాలి. ఆయన ఎక్కడ ఉంటారు?" అని అడిగాడు. ఆ వ్యక్తి తల ఎత్తి చూసాడు. ఎదురుగా ఆధునిక దుస్తులు ధరించిన వ్యక్తి నిలుచొని ఉన్నాడు. "మీరు ఏమి మాట్లాడ దలచారు? చెప్పండి." అన్నాడు. మీకు అర్థం కాదు. నేను వారితో సంస్కృతానికి సంబంధించిన విషయాలు మాట్లాడాలి. నేను

వారిని కలుసుకోవాలి" అని సమాధానం చెప్పాడు. "అట్లాగైతే నాతో రండి. బావి దగ్గరకు పోదాము గాంధీ గారిని అక్కడ కలుసుకోవచ్చు" అన్నాడు.

ప్రధానాచార్యుడు ఆయన వెంట వెళ్ళాడు. అక్కడికి పోయిన తరువాత ఆ వ్యక్తి పాత్రలను తోమడం మొదలు పెట్టాడు. ఆలస్యం అవుతుంది. ఆచార్యుడు ఆయనతో "నేను మహాత్మాజీని తొందరగా కలుసుకోవాలి'' అన్నాడు. అందుకాయన "నేనే గాంధీని. ఏమి చెప్ప దలుచుకున్నారో చెప్పండి" అన్నాడు. ప్రధానాచార్యుని నోటి వెంట మాట రాలేదు. మహాత్మాజీ అంతటివాడు బావిలో నీళ్ళు తోడుతున్నాడు. ఆయనకు శ్రమ యొక్క విలువ తెలిసి వచ్చింది. ఆ రోజు నుంచి ఆయన తన పాండిత్యం శ్రమకు అలంకారమని భావించ సాగాడు. ఆయన పేరు ఆచార్య మణసాలా''

## 52. మెకాలే మానస పుత్రుల దుర్నీతి

"మీరు హిందీని సర్వనాశనం చేసారు." అని గర్జించాడు అప్పు వచ్చిన పెద్ద మనిషి. డాక్టర్ రఘువీర్ చిరునవ్వు నవ్వాడు. ఆయ అటువంటి విమర్శలను అనేక సార్లు విన్నాడు. చిరునవ్వు చూడగా వచ్చినాయన పని అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. "మీరు హిందీ, ఇంగ్లీషులో ఉన్న సరళమైన పదాలను వదిలి పెట్టి నిరుపయోగమైన కఠిన పదాలను ప్రవేశ పెడుతున్నారు. ప్రభుత్వ ధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారు''అన్నాడు. డా॥ రఘువీర శాంతంగా మృదువుగా "దయ చేసి నేను అటువంటి శబ్దాలను వేటివి ఉపయోగించానో చెప్పగలరా? అని ప్రశ్నించాడు. ఆయన సిద్ధంగానే వచ్చాడు. "అందుకోసమేవచ్చాను "ఏమిటి చెబుతారా?'' కుక్కను శ్వానచార్య, ఎద్దును గోస్వామి

గొడుగును ఇంద్రజిత్, నెక్టై కంఠలంగోటి అని అన్నారు.'' అన్నాడు. రఘువీర్ చలించ లేదు. "నేను ఆ పదాలను వాడలేదు'' అన్నారు. కాని ఆ వచ్చినాయన ఒప్పుకోలేదు. ఆఖరుకు డా॥ రఘువీర తాను తయారు చేసిన శబ్దకోశాన్ని చూపించి ఆ పెద్ద మనిషి అపోహను తొలగించాడు. డాక్టర్ రఘువీర కృషిని కించ పరచడానికి కొందరు ఈ శబ్దాలను ఆయన పేరిట ప్రచారం చేశారు. భారతీయ భాషలు అభివృద్ధి చెందకుండా ఉండేందుకు మెకాలే మానస పుత్రులు ఇటువంటి దుశ్చర్యలకు పాల్పడుతూ వచ్చారు.

## 53. ఈ ఆచారమే మన ప్రగతికి ఆటంకంగా వున్నది.

మూఢాచారాలపైన దెబ్బతీస్తూ స్వామి వివేకానంద ఒక కథ చెప్పారు. "హిందూ ధర్మ మందిర శిఖరం మహోన్నతమైనది. ఆ మందిరంలోకి పోవడానికి ఎన్ని మార్గాలు! ఆమందిరంలో లేనిదేమున్నది. వేదాంతులు చెప్పేనిర్గుణ బ్రహ్మ మొదలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, దుర్గ, సూర్యుడు, చంద్రుడు, మూషకవాహనుడైన గణపతి, గంగానమ్మ, పోలేరమ్మ, పోచమ్మ వంటి చిన్న పెద్ద దేవతలంతా ఉన్నారు. ఇంతే కాదు వేదాలు, వేదాంతము, దర్శనములు, పురాణములు, తంత్రము మొదలైన అనేక విషయములు ఉన్నాయి. వాటిలో ఏ ఒక్కటైనా భవబంధాలనుంచి మనలను విముక్తులను చేయగలదు. ఆ మందిరం బయట ఉన్న జన సమూహం ఎంతపెద్దది? 33 కోట్ల మంది ఆమందిరం వైపు పరుగెత్తుతున్నారు.

నాకు కూడా కుతూహలం కలిగింది. అక్కడికి నడిచి వెళ్ళాను. అక్కడ కనిపించిన దృశ్యం నన్ను స్తబ్ధుణ్ణి చేసింది. ఎవ్వరూ మందిరం

లోకి పోవడం లేదు. వాకిట్లో ఏబది తలలు వంద చేతులు రెండు ఉదరాలు, ఏబది పాదాలు ఉన్న ఒక మూర్తి కనిపించింది. అందరూ ఆ మూర్తి పాదాల దగ్గర తిరుగుతున్నారు. నేను సమీపములో ఉన్న ఒకనితో "ఏమిటిది ? " అని అడిగాను. "ఆ మందిరంలో ఉన్న దేవతలకు దూరంనుంచే నమస్కారం చేయాలి. ఒకటి రెండు పుష్పాలు ఫలాలు విసిరి వేస్తే పూజ అయిపోతుంది. కాని నిజమైన పూజ చేయాలనుకుంటే వాకిట్లో ఉన్న దేవతా మూర్తిని పూజించాలి. వేదాలు, పురాణాలు, శాస్త్రాలు చదివి ఉండవచ్చు. కాని ఈయన ఆజ్ఞలనే శిరసావహించాలి."

ఈ దేవాధి దేవుని పేరేమిటి" అని అడిగాను.

"ఆచారము" అని సమాధానం చెప్పాడు.

"ఈ ఆచారమే మన ప్రగతికి ఆటంకంగా ఉన్నది" అన్నారు స్వామీజీ.

## 54. భారతీయ యువకుని సాహసం

చూస్తుండగానే ఆ నల్లటి వస్తాదు విమానం వెనక భాగంలో ఉన్న ద్వారం వద్దకు చేరాడు. దానిని తెరవబోతున్నాడు. అప్రమత్తంగా ఉన్న ఎయిర్ హోస్టెస్ అతనిని ఆపింది వేల కొద్ది అడుగుల ఎత్తులో ఎగురుతున్న విమాన ద్వారాన్ని తెరిస్తే విమానము అందులోని యాత్రికులు నాశనమవుతారు. నీగ్రో వస్తాదు ఒక దెబ్బతో ఆసుకుమారిని పడగొట్టా కోపంతో ఎఱ్ఱపడిన కళ్ళతో బెదిరిస్తూ "ఖబద్దార్ ! ఎవరైన ముందుక వస్తే విమానమును, అందులోని ప్రయాణీకులను నాశనం చేస్తాను. అన్నాడు. ప్రయాణికులలో ఎక్కువ మంది అమెరికావారు. అందరి ముఖాలలో భయం కొట్టవచ్చినట్లు కనుపిస్తుంది.

ఇంతలో ఒక భారతీయ యువకుడు ముందుకు దూకాడు. ఆ నీగ్రో రెండు కాళ్ళు గట్టిగా పట్టేశాడు. నీగ్రో తనకు తెలిసిన కిటుకు

లన్నీ ఉపయోగించాడు. కాని లాభంలేక పోయింది. భారతీయుడు తన పట్టును వదలలేదు. విమానాన్ని నడుపుతున్న పైలట్ కూడా సహాయానికి వచ్చాడు. ఇద్దరూ కలిసి ఆ నిగ్రోను తాడుతో బంధించారు. ఇంత జరిగాక కూడా వాడు అందరి అంతు తేలుస్తానని భయపెడుతూనే ఉన్నాడు. చికాగో పోలీసుల రికార్డులలో ఇతడు పెద్ద నేరస్థుడుగా నమోదై ఉన్నాడు. విమానంలోని ప్రయాణికులందరు భారతీయుని కృతజ్ఞతతో, ఆదరతతో చూసారు. ఆ వీర యువకుని పేరు గురుదేవసింగ్, సెలవులలో ఉన్న ఎయిర్ ఇండియా ఉద్యోగి.

## 55. "నాచేత కూడ ఎందుకు పొగత్రాగిస్తున్నారు"

మహారాజా డుమరావ్ కేసు పని మీద రాజేంద్రప్రసాద్ ఇంగ్లండ్ వెళ్ళుతున్నారు. ఓడలో ఒక తమాషా సంఘటన జరిగింది. ప్రక్కనే కూర్చొన్న ప్రయాణికుడు సిగరెట్టు తాగుతున్నాడు. పొగ రాజేంద్రబాబు వైపు వస్తుంది. ఆయన శాంతంగా "ఏమండీ సిగరేట్ తాగుతున్నారా?" అని అడిగాడు. "అవును" అని సమాధానం మీరు సిగరేట్‌కు డబ్బు చెల్లించారుగదా" "అవును" అన్నాడు. తిరిగి ప్రశ్నించాడు. "నేను దాని కోసం ఏమి ఖర్చు చేయలేదుగదా" "అవును" అన్నాడు ఆప్రయాణికుడు 'అటువంటప్పుడు నాచేత కూడా ఎందుకు పొగ తాగిస్తున్నారు ? " ఆ ప్రయాణికుడు సిగ్గుపడ్డాడు. రాజేంద్రప్రసాద్‌ను క్షమాపణ కోరాడు.

## 56. పని–తీరిక

ఆచార్య ప్రపుల్ల చంద్రరామ్‌ని ఒకరు ప్రశ్నించారు. "మీ జీవితంలో ఎక్కువ పని రోజులేవి ?"

ఆచార్యుడు "సోమరి అయినవాడికి అవసరమైన పనులకు, అంతేం పకు దైనందిన కార్యకలాపాలకు కూడా తీరిక ఉండదు. కాని పనిలో

లన్నీ ఉపయోగించాడు. కాని లాభంలేక పోయింది. భారతీయుడు తన పట్టును వదలలేదు. విమానాన్ని నడుపుతున్న పైలట్ కూడా సహాయానికి వచ్చాడు. ఇద్దరూ కలిసి ఆ నిగ్రోను తాడుతో బంధించారు. ఇంత జరిగాక కూడా వాడు అందరి అంతు తేలుస్తానని భయపెడుతూనే ఉన్నాడు. చికాగో పోలీసుల రికార్డులలో ఇతడు పెద్ద నేరస్థుడుగా నమోదై ఉన్నాడు. విమానంలోని ప్రయాణికులందరు భారతీయుని కృతజ్ఞతతో, ఆదరతతో చూసారు. ఆ వీర యువకుని పేరు గురుదేవసింగ్, సెలవులలో ఉన్న ఎయిర్ ఇండియా ఉద్యోగి.

## 55. "నాచేత కూడ ఎందుకు పొగత్రాగిస్తున్నారు"

మహారాజా డుమరావ్ కేసు పని మీద రాజేంద్రప్రసాద్ ఇంగ్లండ్ వెళ్ళుతున్నారు. ఓడలో ఒక తమాషా సంఘటన జరిగింది. ప్రక్కనే కూర్చొన్న ప్రయాణికుడు సిగరెట్టు తాగుతున్నాడు. పొగ రాజేంద్రబాబు వైపు వస్తుంది. ఆయన శాంతంగా "ఏమండీ సిగరేట్ తాగుతున్నారా?'' అని అడిగాడు. "అవును'' అని సమాధానం మీరు సిగరేట్‌కు డబ్బు చెల్లించారుగదా'' ''అవును'' అన్నాడు. తిరిగి ప్రశ్నించాడు. ''నేను దాని కోసం ఏమి ఖర్చు చేయలేదుగదా" ''అవును'' అన్నాడు ఆప్రయాణికుడు 'అటువంటప్పుడు నాచేత కూడా ఎందుకు పొగ తాగిస్తున్నారు ? '' ఆ ప్రయాణికుడు సిగ్గుపడ్డాడు. రాజేంద్రప్రసాద్‌ను క్షమాపణ కోరాడు.

## 56. పని–తీరిక

ఆచార్య ప్రఫుల్ల చంద్రరామ్‌ని ఒకరు ప్రశ్నించారు. "మీ జీవితంలో ఎక్కువ పని రోజులేవి ?"

ఆచార్యుడు "సోమరి అయినవాడికి అవసరమైన పనులకు, అంతేంపకు దైనందిన కార్యకలాపాలకు కూడా తీరిక ఉండదు. కాని పనిలో

నిమగ్నుడైన వ్యక్తికి సమయం లేక పోవడం అంటూ వుండదు. వాస్త వానికి నాకు అరవై సంవత్సరాలు నిండాకనే నిజంగా ఎక్కువ పని ఉంటుంది. ఈసమయంలో నేను వైజ్ఞానిక ప్రదర్శనలను ప్రారంభించడం, స్వదేశ ప్రచారం, రెండులక్షలమైళ్ళు మనదేశంలో ప్రయాణం వంటిపనులు చేసాను. రెండు సార్లు ఐరోపాకు వెళ్ళాను. ఇన్ని పనులలో ఉన్నప్పటికీ ఏ పరిశోధన కార్యక్రమానికి ఆటంకం కలుగనీయలేదు. సెలవు రోజులను తగ్గించుకొని పరిశోధన చేస్తున్నాను.' అన్నారు.

## 57. వృక్షానికి వేరుగా వుండేవారు కావాలి

అదొక కుగ్రామం. కేవలం వంద ఇళ్ళు ఉంటాయి. అందులోఉండే ఒక సన్యాసి రోడ్లను శుభ్రం చేయడం, నిరక్షరాస్యులకు చదువు నేర్పడం, రోగులకు మందులివ్వడం, వృద్ధులకు అంగవైకల్యమున్నవారికి సహాయం చేయడం కథలు చెప్పడం వంటి పనులలో నిమగ్నుడై ఉంటున్నాడు. గ్రామంలోని అజ్ఞానులైన వారికి సాధువు గొప్పతనం ఏమితెలుసు ? ఒక సారి గ్రామానికి బాగా చదువుకొన్న ఒక యువకార్యకర్త వచ్చాడు. ఆయన సాధువుతో మాట్లాడాడు. నిజానికి సాధువు కాశీలో గొప్ప సం స్కృత విద్వాంసుడు. అటువంటి వ్యక్తి ఒక గ్రామంలో జీవిస్తుండడం యువకునికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

యువకుడు ఆయనతో "స్వామీ మీవంటి ప్రతిభావంతుడు దేశవిదే శాలకు వెళ్ళి సంస్కృత ప్రచారం చేయాలి. ఇక్కడే గ్రామంలో ఉన్నారే మిటి ? "అన్నాడు. సాధువు" నాయనా ! దేశంలో నావంటి మనుష్యులకు కొదువలేదు. కాని దుమ్ములో కలిసిపోవాలనే కోర్కెఉన్నవారులేరు. నలు దిక్కులా కీర్తి వ్యాపించిన పండితులున్నారు. తాము దుమ్ములో ఉంటూ భావి వికాసమనే చెట్టుకు మూలంగా ఉండేవారు. తాము నేలమీదనే ఉంటూ ఆ వృక్షానికి పోషణను ఇచ్చేవారు లేరు. చెట్టు యొక్క వికాసానికి

మొదలు కూడా అవసరం. నేను అటువంటి వేరు కావాలనుకొంటుం న్నాను. ఎప్పుడో అప్పుడు అదీ వటవృక్షమవుతుంది.'' అన్నాడు. ఆయన యొక్క ప్రతిభ భవిష్యత్తు అనే వృక్షానికి మొదలుగా ఉంటున్న దని యువకుడు తెలుసు కున్నాడు.

## 58. మానవ సేవలో శరీరం ఆహుతి

మోరియో పోజియో అనే వ్యక్తి టూరిన్ (ఇటలీ) విశ్వవిద్యాలయంలో రేడియాలజిస్టు. ఆమె కేన్సర్ వ్యాధిని గురించిపరిశోధన జరుపుతుండేవారు. రేడియం కిరణాల యొక్క ప్రభావాన్ని తెలుసుకోవడం కోసం వాటిని తన శరీరం మీదనే ప్రసరింపజేసిన కారణంగా ఆమె ఎడమ చేతి వేలిని తీసి వేయవలసివచ్చింది. ఆవిడ శాంతచిత్తంతో "నాలుగు వేళ్ళు చాలు" అన్నారు. తరువాత ఆమె ఎడమ చేతిని, కుడి చేయి ముందు భాగాన్ని తీసివేయవలసివచ్చింది. ఆమె అవస్థనుచూసి ఆమెస్నేహితులు రేడియంకు దూరంగా ఉండమని సలహా ఇచ్చారు. ఆమె వారితో ''మనం మన జీవితంలో ప్రతి క్షణం సద్వినియోగపరచుకోవాలి. ఈ ప్రయోగాలను చేయటమే నా జీవన పరమార్థము" అని అన్నారు. మానవసేవలో తన శరీరాన్ని ఆహుతి చేశారు.

## 59. సత్యం జయించింది

మద్రాసులోని ఒక పెద్ద కంపెనీలో ఒక స్వయంసేవక్ పని చేస్తున్నాడు. అందులోని అధికారి పెద్ద జీతం తీసుకొంటున్నప్పటికి అవినీతిపరుడు. చెడు పనులలో తనతో సహకరించడం లేదని ఆయనకు స్వయంసేవక్‌పై కోపము. ఒకరోజు ఆయన ఈయనను బెదిరిస్తూ ''నీ వ్యవహారం బాగా లేదు. జాగ్రత్త! నీజీవితాన్ని నాశనం చేస్తాను. నువ్వో నేనో తేలిపోవాలి" అన్నాడు. స్వయంసేవక్ శాంతంగా ''మీరు ఈ

విధంగా అనడం సరికాదు. నేను పోదినా? మీరు పోతారా? అనేది భగవంతుని ఎరుక. నా తప్పు ఏదైనా ఉంటే చెప్పండి సరిదిద్దుకొంటాను." అన్నాడు. ఈ సమాధానం వింటూనే అధికారి మండిపడ్డాడు. వారిరువురి మధ్య విరోధం పెరుగుతూ వచ్చింది. స్వయంసేవక్ తగిన ఆధారాలతో అధికారి యొక్క అవినీతి చర్యలను కంపెనీపాలకవర్గానికి తెలియజేసాడు. వారు ఆ అధికారిని ఉద్యోగ - నుంచి తొలగించారు. సత్యం జయించింది.

## 60. ముందు వ్యక్తిని కలపాలి

ఒక రోజున కొందరు కాలేజీ విద్యార్థులు వినోభాజీవద్దకు వచ్చారు. ఆయన వారందరికి కాగితంముక్కలుఇచ్చి వీటితో భారతదేశంనమూనాను తయారుచేయండి" అన్నారు. వారంతా కలిసిచాలాసేపు ప్రయత్నించారు. కాని భారతదేశం నమూనా తయారు చేయలేకపోయారు. సమీపంలోనేఉన్న ఒక యువకుడు ఇదంతా చూస్తున్నాడు. అతడు కొద్దిగా చొరవతీసుకొని 'మీరు అనుమతిస్తే వాటిని నేను అమర్చుతాను'' అన్నాడు.

వినోభాజీ అనుమతితో ఆ యువకుడు కొద్దిసేపటితోనే భారత దేశం ఆకారాన్ని తయారుచేశాడు. ''నీవు ఇంత త్వరగా ఈ ముక్కలను ఎట్లా కలపగలిగావు?'' అని వినోభాజీ అడిగారు. 'ఈ ముక్కలకు ఒక వైపు భారతదేశం పటం ఉంది. నేను మనిషి బొమ్మను తయారుచేశాను. భారతదేశం పటం దానంతటదే వచ్చింది' అన్నాడు.

అప్పుడు వినోబా 'మనం దేశాన్ని కలపాలంటే మొదట వ్యక్తిని కలపాలి. వ్యక్తులను కలిపితే దేశం దానంతట అదే కలుస్తుంది.

## 61. ఆచార్య హజారీ ప్రసాద్ ద్వివేది

ఒక దీన ఆక్రందన, స్త్రీ కేక తరువాత అంతా నిశ్శబ్దం. పొలం నుంచి వస్తున్న ఒక వ్యక్తి దానిని గమనించి శబ్దం వచ్చినవైపుచూశాడు.

అక్కడ ఒక మహిళ కేకలు వేస్తూ పడిపోవడం గమనించాడు. ఒక నల్లటి సర్పం అటుగా పోతుండడం కనిపించింది. అతనికి అంతా అర్థమైంది. ఆమెకు పరిచర్య చేయడంలో నిమగ్నుడైనాడు.

కుడికాలుమీద పాము కాటువేసింది. విషం పాకకుండా పైభాగంలో గట్టిగా అదిమిపట్టుకున్నాడు. అట్లా ఎంతసేపుపట్టుకోగలడు? కట్టేటందుకు ఏమీ దొరకలేదు. తన యజ్ఞోపవీతాన్ని తెంపి కట్టుకట్టాడు. కొడవలితో గాయాన్ని కోసి చెడు రక్తాన్ని తొలగించాడు.

ఇంతలో గ్రామం నుంచి ప్రజలు వచ్చారు. 'బ్రాహ్మణ కులంలో పుట్టి పరమ పవిత్రమైన యజ్ఞోపవీతాన్ని హరిజన మహిళ కాలికి కట్టి ధర్మాన్ని నాశనం చేశావు' అంటూ కొందరు అతనిని నిందించారు. ఆ పరోపకారి దృష్టి వారిపై లేదు. ఆ మహిళ ప్రాణాన్ని రక్షించడంలో నిమగ్నుడై ఉన్నాడు. చివరకు కాపాడగలిగాడు. ఆ విధంగా ఆమెను రక్షించగలిగానన్న సంతోషంలో ఉన్నాడు. ఆయనే సుప్రసిద్ధ హిందీ సాహిత్యవేత్త ఆచార్య హజారీ ప్రసాద్ ద్వివేది.

## 62. గోపాలకృష్ణ గోఖలే

ఒక విద్యార్థికి వాళ్ళ లెక్కల మేష్టారు ఇంటివద్ద చేసుకొని రమ్మన మని న్ని లెక్కలు ఇచ్చారు. ఒక విద్యార్థి కొన్ని లెక్కలను చేసాడు. కాని క్కలెక్కను మాత్రం స్నేహితునిసహాయంతో చేయవలసివచ్చింది. మరు టి జు అన్ని లెక్కలు సరిగా చేసినందుకు ఉపాధ్యాయుడు అతనిని మెచ్చుకొ తన కలాన్ని బహుమతిగా ఇచ్చాడు.

ఆ టి. ఆ విద్యార్థి ఏడుస్తున్నాడు. 'మాష్టరుగారు! నేను ఒక ప్రశ్న మి హాయంతో చేశాను. అన్ని ప్రశ్నలు నేను చేయలేకపోయాను. ల్ని మోసం చేశాను. ఈ బహుమానానికి అర్హుణ్ణి కాను. నన్ను దండించం' అన్నాడు.

విద్యార్థియొక్క నిజాయితీకి ఉపాధ్యాయుడు చాలాసంతోషించాడు. 'నేను ఈ బహుమతిని నీ సత్యసంధతకు ఇస్తున్నాను' అన్నాడు.

ఆ బాలుడే తరువాత మహాత్మాగాంధీకి రాజకీయ గురువుగా ప్రసిద్ధి కెక్కిన గోపాలకృష్ణ గోఖలే.

## 63. "నేనే తాంతియాను, పట్టుకొంటారా?"

మధ్యభారత్‌లోని నిరాడ్ క్షేత్రంలోని తాంతియా భిల్లు యొక్క తిరుగుబాటు ఆంగ్ల ప్రభుత్వాన్ని గడగడలాడించింది. 25, 26 ఏళ్ళ వయస్సుగల శాంతిప్రియులైన యువకులను వంచించి భూమి లభించకుండా చేయడమేకాక వారిపై దొంగకేసులు బనాయించి జైలుకుపంపించిన ద్రోహులను ఒక్కొక్కరిని నేక విధాలుగా శిక్షించేవాడు. తమను పట్టుకోవడానికి వచ్చే ఆంగ్లేయ ప్రభుత్వాధికారుల్ని కఠినంగా శిక్షిస్తూ, వారి ముక్కు, చెవులను కోసివేశారు. భయంతో వణికిపోతూ ప్రాణభిక్షను కోరిన అధికారులను క్షమించి వదిలిపెట్టారు.

ఒకసారి తాంతియాని బంధించడం కోసం ఇంగ్లండు నుంచిప్రత్యేకంగా ఒక అధికారి రప్పించబడ్డాడు. ఈ విషయం తాంతియాకు తెలిసింది. ఆయన కూలీ వేషంలో సామాను మోయడం కోసం వెళ్ళాడు. ఏకాంతంగా ఉన్న అడవి ప్రాంతాన్ని చేరగానే తాంతియా ఆయన ఎదుట ఛాతి విరచి నిలబడి, 'నేనే తాంతియాను పట్టుకొంటారా?' అన్నాడు. అధికారికి నోటి వెంట మాట రాలేదు. శరీరంలో వణుకు పుట్టుకొచ్చింది. కళ్ళు ప్రాణభిక్షను యాచిస్తున్నాయి. దయనీయమైన ఆయన స్థితిని చూసి 'ఇక ముందు ఎన్నడూ నా ఎదుటికి రావద్దు అని హెచ్చరించి ప్రాణాలతో వదిలిపెట్టాడు. ఈ సంఘటనతో భయపడిన ఆ అధికారి ఉద్యోగం మాను కొని ఇంగ్లండుకు వెళ్ళిపోయాడు.

చివరకు భారతీయుడే మోసంచేసి అతనిని పట్టియిచ్చాడు. ఒక సోదరి అతని చేతికి రక్ష కట్టింది. అదే రోజు ఒక సోదరుడు అతని చేతికి బేడీలు తగిలించాడు.

## 64. "నా వంశంలో ఎవ్వరూ జీవించివుండకుండా వరం ఇవ్వండి!"

పూరీలోని జగన్నాథ మందిరంలో దారుప్రతిమలను ప్రతిష్ఠించి మహారాజు ఇంద్రద్యుమ్నుడు రాత్రినిద్రపోతున్నాడు. కలలోజగన్నాథుడు 'కనబడి వరం కోరుకోమన్నాడు. మహారాజు 'స్వామీ! నేను వరం కోసం ఈ పనిని చేయలేదు. నాకు వరం అక్కరలేదు.'

జగన్నాథుడు ఒప్పుకోలేదు. వరం ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. ఇంద్రద్యుమ్నుడు 'నేను వద్దన్నప్పటికీ మీరు వరం ఇవ్వదలిస్తే నా వంశంలో ఎవ్వరూ జీవించి ఉండకుండా వరం ఇవ్వండి' అన్నాడు.

పదునెనిమిదిమంది పుత్రుల తండ్రియైన ఇంద్రద్యుమ్నుని కోర్కె విని 'భక్తా! ఇదేమి కోరిక!' అని జగన్నాథుడు అడిగాడు. 'మహాప్రభో! ఈ విశాల మందిర నిర్మాణము, మీ మూర్తి ప్రతిష్ఠ వల్ల లభించే శ్రేయస్సును అనుభవించడానికి నా వంశంలో ఎవ్వరూ ఉండరాదని కోరుకుంటున్నాను. ఎందుకంటే వారు అహంకారంతో ఈ మందిరాన్ని మా తాత, తండ్రి నిర్మించారు అని చెప్పకొంటూ తమ పుణ్యబలాన్ని, నా పుణ్యబలాన్ని నష్టపరుస్తారు. అందువల్ల మీరు ఈ వరాన్ని దయతో ఇవ్వవలసింది' అన్నాడు.

జగన్నాథుడు "తథాస్తు" అన్నాడు. నేటికి పూరీ నగరం వెలుపల అఠర్‌సలా అనే స్మశానం మనకు కనుపిస్తుంది. అది ఇంద్రద్యుమ్నుని పదునెనిమిది పుత్రుల స్మశానము.

## 65. "ఖబర్దార్! పడవలో అడుగు పెట్టారంటే ఊరుకొనేది లేదు!"

ఆంగ్లేయ సైన్యం వచ్చిపడింది "ఏ అబ్బాయ్! పడవ తీసుకొనిరా. మేము నదిని దాటాలి" అంటూ తెల్ల సైన్యం పడవ నడిపే బాలునితో బెదిరింపుగా అన్నారు. ఈ పిల్లవాడు చెప్పినట్లు వింటాడనుకొన్నారు. కాని అతడు కదలలేదు. వయస్సు పన్నెండేళ్ళుంటుంది. కాని వారు దుష్టులైన ఆంగ్లేయులని గుర్తించాడు. గ్రామాన్ని చేరితే తమకు సుఖ శాంతులు లేకుండా చేస్తారు. అందు వలన వీరిని నది దాటించరాదు అనుకున్నాడు. తిరస్కరించాడు. ఆంగ్లేయ అధికారి "అరే తే! పడవ కట్టు" అన్నాడు. "నేను మిమ్మల్ని తీసుకొని పోను" గట్టిగా సమాధానం చెప్పాడు. "ఇక చాలు పడవ ఎక్కండి" అధికారి సైనికులను ఆదేశించాడు.

"ఖబర్దార్! పడవలో అడుగు పెట్టారంటే ఊరుకొనేదిలేదు." అన్నాడు. ఇదేదో పిల్లవాడు తమాషా చేస్తున్నాడనుకొని ఆంగ్లేయ సిపాయి ముందుకు వచ్చాడు. కాని మాడ పగిలింది రక్తం నదిలో ప్రవహించింది.

ఎంత ధైర్యం? సైనికాధికారికి కోపం వచ్చింది. మరుక్షణం ఆయన చేతిలోని పిస్తోలు గర్జించింది. అంతటా నిశబ్దం. అమాయకుడైన ఆ బాలుడు స్వాతంత్ర్య యజ్ఞంలో ఆహుతి అయినాడు. తాను ప్రాణాలతో ఉండగా ఆంగ్లేయులను గ్రామంలోనికి పోనివ్వలేదు.

## మాలవ్యాజీ ధన సంగ్రహం

కాశీ విశ్వ విద్యాలయం కోసం నిధులు వసూలు చేసేందుక మహామనా మాలవీయా హైదరాబాదుకు వచ్చారు. హిందూ విశ్వ విదాలయమునకు దానం ఇవ్వడానికి నిజాం ఒప్పుకోలేదు. ఆయన స్పష్టం తిరస్కరించాడు.

హైదరాబాద్ వీధిలో ఎవరో సేఠ్ శవ యాత్ర జరుగుతోంది. పైసలు వెదజల్లుతున్నారు. చాలా మంది వాటిని ఏరుకుంటున్నారు. వారితో మహామనా మాలవీయ ఉన్నారు. అందరూ ఆశ్చర్య పోయారు. "స్వామీ! మీరు చేస్తున్నదేమిటి?" అని ప్రశ్నించాడు ఒక వ్యక్తి.

"కాశీకి పోయినపుడు ఉత్త చేతులతో తిరిగి వచ్చానని చెప్పడము కంటే కొద్ది పైసలు ప్రోగు చేసుకొని పోవడము బాగుంటుంది కదా." అన్నాడు.

విషయం దాగదు కదా! నిజాముకు తెలిసింది. సిగ్గు పడ్డాడు. విశ్వ విద్యాలయానికి ధనం యిచ్చాడు.

## 67. గొప్ప వేదాంతి అయిన అనంత్ భట్

"అత్తా ఈ పండుగ రోజున నేను కూడ పంక్తిలో అందరితో కలిసి వెండి కంచములో తింటాను" అని అనంతభట్ అత్తగారితో అన్నాడు. మామగారు ప్రఖ్యాత విద్వాంసుడు. బాలభట్ పాయగుండే. ఆయన కాశీ విద్యాలయాన్ని నడుపుతున్నాడు. ఆ ఖర్చును జయపూర్ సంస్థానం భరిస్తోంది. అందులో ఒక నియమం ఉంది. చతుర్‌శాస్త్రి, షట్‌శాస్త్రి అయిన వారు వెండి పళ్ళాలలో భోజనం చేస్తారు. మిగిలిన సామాన్య విద్యార్థులకు అరటి ఆకులలో వడ్డిస్తారు.

అల్లుడి పట్టుదల చూచి అత్తగారు భర్త అనుమతి కోరింది. బాలభట్ "ఈ ఇంట్లో వెండి కంచంలో భుజించే గౌరవం కేవలము విద్వాంసులకు మాత్రమే పరిమితము. అల్లుడికి లభించదు? ఒక వేళ నీకు అల్లుడంటే అంత ఇష్టం ఉంటే వంట ఇంట్లో వెండి కంచములోవడ్డించు. అంతే గాని పంక్తిలో వడ్డిస్తే విద్వాంసులను అవమానించినట్లవుతుంది. అందువలన ఈ పని నేను చేయలేను. అన్నాడు బాలబట్.

అనంతభట్ ఏమీ మాట్లాడకుండా అరటి ఆకులోనే తిన్నాడు. కాని ఆయన ఆత్మాభిమానం దెబ్బతిన్నది. ఆయన తరువాత గొప్ప వేదాంతి అయినాడు. ఆయన సహాధ్యాయి రామశాస్త్రి ప్రభుణే.

## 68 వనవాసీ బాలిక సాహసం

ఆమె చిన్న వనవాసీ బాలిక. గడ్డి కోసుకొని తన గ్రామమైన రాస్తాపాల్ (రాజస్థాన్)కు వస్తోంది. ఒక విచిత్రమైన దృశ్యాన్ని చూసి వెనుకంజ వేసింది. ఒక ట్రక్కు వెనకాల తాడుతో కట్టిన మనిషిని ఈడ్చుకొని పోతుంది. చిన్న పిల్ల అరుస్తూ ట్రక్కు వెనకాల పరుగెత్తుతోంది. "మీరు మాయేష్టారు గారిని ఎక్కడకు తీసుకొని పోతున్నారు. ఆయనను వదిలి పెట్టండి. వదిలి పెట్టండి" అంటోంది. చేతిలో కొడవలితో భయంతో అరుస్తూ పోతున్న ఆ బాలికకు పోలీసుల తుపాకులంటే భయం లేదు. వారి బెదిరింపులను లక్ష్యపెట్ట లేదు. వనవాసులు కూడ ఉత్సాహంతో వెంట పరుగెత్తుతున్నారు. ఇది చూచిన పోలీసు అధికారి తుపాకిని ఎక్కు పెట్టి "ఏయ్ అమ్మాయ్! వెనక్కుపో లేకపోతే కాల్చి పారేస్తాను" అన్నాడు. ఇంతలో అమ్మాయి మాస్టరు సేంగాభాయి గారిని కట్టిన తాడును కొడవలితో కోసి వేసింది. పోలీసు అధికారి కోపముతో కాల్పులు జరిపాడు. గుండ్లు తగిలి ఆ బాలిక మరణించింది.

కాలీబాహ్ మరణంతో కోపోద్రిక్తులయిన వనవాసీలు రణ భేరి మ్రోగించారు. పోలీసుల మీద విరుచుకు పడ్డారు. భయ భ్రాంతులైన పోలీసులు, మెజిస్ట్రేట్ పరుగెత్తారు. డూంగర్‌పూర్ మహారాజా ఆదేశము మేరకు అన్ని పాఠశాలలు మూసివేసారు. వనవాసీలు చదువుకొన్నట్లయితే అధికారము కావాలని కోరుతారు. 19 జూన్ 1947 నాటి సంఘటన ఇది. సేంగాభాయి మాస్టర్‌జీ రక్షించ బడ్డాడు. నేటికి భిల్లుల సేవలో నిమగ్నుడై ఉన్నాడు.

## 69. జ్ఞానోదయం

ఆచార్య రామానుజులు యువకుడిగా ఉండే రోజుల్లో ఒకనాడు దేవాలయానికి ప్రదక్షిణ చేస్తున్నాడు. ఒక దివ్యమైన తమిళ భజనను మధురంగా పాడుతున్నాడు. ఆ సమయములో ఒక హరిజన స్త్రీ ఆయన దారికి అడ్డు వచ్చింది. రామానుజులు కోపముతో మండి పడ్డాడు. "దూరంగా పో పవిత్రమైన మార్గాన్ని అపవిత్రం చేయకు." అన్నాడు.

ఆమె తొలగలేదు. మిక్కిలి వినయముతో "స్వామీ నలుదిశలా పవిత్రత వ్యాపించి యున్నది. నా అపవిత్రతను ఎక్కడికి తీసుకొని పొమ్మంటారు?"

ఆమె సరళమైన మాటలు ఆచార్యునికి జ్ఞానోదయం కలిగించాయి. "తల్లీ! నన్ను క్షమించుము. నీవే పవిత్రురాలవు. ఎవరిలో కల్మషముంటే వారికి బయటంతా కల్మషము కనిపిస్తుంది. నీకు నిర్మలమైన అంతఃకరణ ఉన్న కారణంగా చుట్టూ పవిత్రత చూడగలిగావు. నీవు ధన్యురాలవు తల్లీ!" అని అన్నాడు.

## 70. జీవితరహస్యం

సన్యసించటానికి పూర్వము స్వామి రామతీర్థ పేరు తీర్థరామ్. ఆయన లాహోర్‌లోని కాలేజీలో గణిత శాస్త్ర ఆచార్యుడు. ఒక రోజు ఆయన బోర్డు మీద ఒక గీత గీసి దానిని చెడపకుండా ఎవరైనా పొట్టిది చేయగలరా? అని అడిగాడు. తరగతిలో ఎవ్వరూ మాట్లాడ లేదు. ఒక విద్యార్థి లేచి దాని ప్రక్కన మరొక పొడవైన రేఖను గీసాడు. దానితో మొదటి రేఖ పొట్టిదైంది. తీర్థరామ్ చాలా సంతోషించాడు. జీవిత రహస్యం కూడా ఇదే. మీరు పెద్దవారు కావాలనుకుంటే పెద్దవారి వెనుక బడరాదు. మీరు స్వయంగా వారికంటే పెద్దవారుకండి. వారు మీకంటే చిన్నవారు అవుతారు. అన్నాడు—.

# అమృత వచనములు

## 1

భారతదేశం చరిత్రను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన పిదప సంఘ నిర్మాత ప॥ పూ॥ డాక్టర్జీ ఒక నిర్ణయానికి వచ్చారు. అదేమంటే "ఈ దేశంలో సాధు సత్పురుషుల కృషి ద్వారా ప్రజలలో భవ్యము. సముజ్వలము అయిన ఒక భావం నిర్మాణమవుతూ వచ్చింది. ప్రభుత్వపు దయా దాక్షిణ్యాలపై కాక సంస్కార వంతులైన పౌరుల కర్తృత్వంపై సమాజం ఆధార పడింది. ఆ సమయంలో ఈ రాష్ట్రం కూడా ఎంతో భవ్యంగాను, దివ్యంగాను విరాజిల్లింది. ఐతే కాల గతిలో ప్రజా జీవనంలో స్వార్థ పరత్వం, క్షుద్రతలు పెచ్చు పెరిగిన కారణంగా కోట్లాది జన సంఖ్య, సాటి లేని శౌర్య సంపదలు కలిగి కూడ మన దేశం కొద్ది మంది ఆక్రమణదారుల చేతుల్లో ఓడిపోయింది. మన శౌర్య పరాక్రమాలన్నీ రా[illegible]ణ కారుల ఊడిగంలో సమర్పితమయ్యాయి." ఈ పరిస్థితిని [illegible] కృత నిశ్చయంతో డాక్టర్జీ 56 సం॥లకు పూర్వము సంఘ క[illegible]కి [illegible]ంకురార్పణ చేసారు.

## 2

సమాజాన్ని శక్తివంతం చేయాలని రాష్ట్రీయ స్వయం సేవక సంఘ్ కోరుతున్నది. సమాజంలో సామర్థ్యం సహజంగానే ఎల్లప్పుడూ ఉండాలని సంఘం భావిస్తున్నది. ఏదో ఒక బాహ్య శక్తి ద్వారా సమాజం ఎల్లప్పుడు కాపాడబడుతూ ఉండటం శ్రేయస్కరం కాదు.

“ఇది సమాజం” అనే పేరు సార్థకం కావాలంటే ఒకే జీవిత విధానం కలిగిన వ్యక్తుల మధ్య స్వాభావికమైన ఒక వ్యవస్థ అవసరం. అట్టి వ్యవస్థలోనే సమాజం యొక్క నిజమైన సామర్థ్యం నెలకొని ఉంటుంది. ఇలాంటి సామర్థ్యం జాగృతమయినప్పుడే సమాజము తన సమస్యలన్నింటిని పరిష్కరించుకునేందుకు తనకు తాను ఎప్పటికప్పుడు సంసిద్ధమవుతుంది. ఇట్టి సహజమైన సామర్థ్యాన్ని మేల్కొల్పే కార్యాన్నే సంఘం చేస్తోంది.

## 3

బాహ్యమైన చట్టాలు, విధానాలు, కట్టుబాట్లపైన మన సమాజం అతి తక్కువగా ఆధారపడింది. ఇతర సమాజాలతో పోల్చి చూస్తే ఇదే మన ప్రత్యేకత. ఒక వర్గం మరో వర్గాన్ని గుప్పిట్లో పెట్టుకోవడం, ఒకరు మరొకరిపై అత్యాచారం గావించడం- ఇలాంటి వాటిని నివారించటానికి, సమాజంలో ఒక వ్యవస్థను నిలపటానికి రూపొందించబడ్డ రాజశాసనాలు మనకు చాలా తక్కువ. సచ్ఛీలము కలిగి, సామాన్యులతో తాదాత్మ్యంచెంది, అందరి జీవితాలలో పాలుపంచుకుంటూ ఉం వ్యక్తులను నిర్మించడానికి, మన సమా ంలో ిరంట మూ ప్ర యత్నం జరుగుతూ వచ్చింది. అలాంటి వ క్తు తమ ప్ర వల్ల యయము, ఉత్కృష్టము అయిన సమాజాన్ని ర్మిం చడం సామర్థ్యం కలిగే ఉండే వారు.

— ధా కమల ముఖర్జీ

ఎన్నో శతాబ్దాలుగా ... గియున్న మనం ఈ రోజున హిందూ ధర్మం యొక్క ఇనాత కయుగంలో ఉంటున్నాం. మన

ధర్మాన్ని మనమొక నూతన దృక్పథంతో చూడడం ఆరంభించాం. మన సమాజం సంతులనాన్ని కోల్పోయింది. ఇదిమనం గుర్తించాం. సమాజంలో కాలుష్యం, రుగ్మతలు ప్రవేశించాయి. దీనిని మనం గ్రహించాలి. వీటిని ప్రక్షాళన చేయడం అవసరం. హిందూ ధర్మానికి ఆధారమైనట్టి శాశ్వత తిలోదకాలు ఇవ్వవలసిన అవసరం ఏమాత్రమూ లేదు. ఆ సిద్ధాంతాలకు నేటికనుగుణమైన రీతిలో వ్యాఖ్యానించి చెప్పడమే ఈనాడు మనం చేయ వలసిన పని. ఇదే ఈనాటి ఆవశ్యకత. ఇది మనకు కొత్తేమీ కాదు. ఇలాంటి ప్రయత్నాలు గతంలో హిందూ ధర్మ చరిత్రలో ఎన్నో సార్లు జరిగినవే. ఆ ప్రయత్నాల పరంపరలో ఇది కూడా ఒకటి అవుతుంది.

—డా॥ రాధాకృష్ణన్

## 5

హిందువు అన్న మాట ఏదో ఒక చులకన భావాన్ని ప్రకటిస్తుం దని గాని, ఈ పేరు మనకు మొట్టమొదటగా ముస్లిం దురాక్రమణకారులే పెట్టారని గాని నేను నమ్మను. కాకపోతే మన పతనంతోబాటే ఈ శతాబ్దానికి కూడా విలువ తగ్గిపోయిందని మాత్రం నేను అంటాను. ఈ శతాబ్దం యొక్క పూర్వ చరిత్రను అధ్యయనం చేస్తే దీనితో ముడి పడి ఉన్న చులకన భావం చాలా కాలం తరువాత ఏర్పడిందనీ, అది హిందూ జాతి యొక్క పతనం వల్లనే ఏర్పడిందనీ గ్రహించ వచ్చు. ముస్లిం దురాక్రమణకు చాలాముందే మనల్ని ఇతర దేశాల వారు హిందువులుగా గుర్తించేవారు.

—లాలాలజపతిరాయ్

# 6

ఆస్తికులైనా, నాస్తికులైనా, సంశయవాదులైనా, జడవాదులైనా హిందూ సంస్కృతిని, హిందూ జీవన పద్ధతిని అనుసరించే వారందరూ హిందువులే. హిందూ ధర్మం మన విశ్వాసాలపైనగాక జీవితం యొక్క ఆధ్యాత్మిక, నైతిక దృష్టి కోణాల నుంచే నొక్కి వక్కాణిస్తుంటె ఒకడు ఏ మతాన్ని అనుసరిస్తున్నాడన్నది ప్రశ్న కాదు. సత్కార్యాలు చేసే ఏ వ్యక్తి దుర్గతి కెప్పుడూ లోనుకాడు.

"నహి కళ్యాణ కృత్ కశ్చిత్ దుర్గతిం తాతగచ్ఛతి"

—డా॥ రాధాకృష్ణన్

# 7

హిందుత్వము నశించిపోతే ప్రపంచానికి ఎంతో లోటు కలుగుతుంది ప్రపంచం ప్రసక్తి లేకపోతే హిందువులు నశించినా, హిందుత్వం నష్టమైనా నేనేమాత్రం ప్రాముఖ్యం ఇవ్వను. ధర్మానికీ, తత్వజ్ఞానానికీ వ్యావహారిక రూపాన్ని ఇచ్చిన జాతి యావత్ ప్రపంచంలోను మన హిందూ జాతి ఒక్కటే ఆత్మ నిత్యమని విశ్వసించడం మాత్రమేగాక భిన్నత్వంలో ఏకత్వాన్ని సాక్షాత్కరింప చేస్తున్నది కూడా మన జాతి ఒక్కటే. ఈ సిద్ధాంతాలను ఇవ్వాళ కాకపోతే రేపు, రేపు కాకపోతే ఎల్లుండి- ప్రపంచం యావత్తూ స్వీకరిస్తుంది. వీని ఆవశ్యకతను గుర్తిస్తుంది. ఏదో ఒక రోజున ప్రపంచం ఆధ్యాత్మికతవైపు మొగ్గక తప్పదు. ఆనాడు మార్గ దర్శనం చేయ గలిగేది మన హిందూ జాతి మాత్రమే అట్టి ఈ హిందూ జాతి నశించిపోతే ఏమవుతుంది? మానవ జాతి మళ్ళీ ఓ, న, మాల నుండి మొదలు పెట్టవలసి వస్తుంది.

—పం॥ మదన మోహన మాలవ్య

# 8

జాతీయ ఐక్యతా, సర్వాధిక సుసంఘటిత శక్తి. -ఈ రెండూ మనకు పరంపరగా వస్తున్న హిందుత్వ అనే సంపద. వివిధ కులాలు భాషలు, మతాలు, విరుద్ధ శీతోష్ణ స్థితులు ఉన్నప్పటికీ హిందుత్వమే ఈ దేశాన్ని ఒకే జాతిగా రూపొందించింది. ప్రపంచంలోని ప్రాచీన నాగరికత లన్నీ మట్టిలో కలిసి పోయాయి. కానీ భారత దేశం మాత్రము విదేశీ శక్తుల నిరంతర దండయాత్రలకు తట్టుకుని ఒక జాతిగా జీవించే ఉంది. ఇది మనం చూస్తున్నాం. భారత దేశ చరిత్రలో ఏకాత్మ భావన హిందూత్వం కావడమే దీనికి కారణం. అందరినీ ఒకే జాతిగా కలిపి ఉంచింది. హిందుత్వం యొక్క ఐక్యతా తత్వమే.

—మహంత్ దిగ్విజయనాథ్

# 9

భారత దేశాన్ని మహోన్నతమొనర్చి భారత దేశ భవిష్యత్తును ఉజ్వలమొనరించాలంటే, సంఘటన, శక్తి సముపార్జన, చెదిరిపోయిన ఇచ్ఛాశక్తుల సమీకరణ ఎంతో ముఖ్యము. ఋగ్వేదంలోని ఈ మంత్రం ఎల్లప్పుడూ మనన యోగ్యమైనది.

"సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో
మనాంసి జనతాం, దేవాభాగం
యధా పూర్వే సంజాననా ఉపాసతే।"

—అనగా మీ అందరి మనస్సులు ఒకటే కావాలి. మీ అందరి మాట, బాట ఒక్కటే కావాలి. పూర్వం దేవతలు ఏకమనస్కులైనందునే అమృతాన్ని పొందగలిగారు. కావున అందరూ ఏకమనస్కులు కావడమే సమాజ వ్యవస్థలోని రహస్యం.

—స్వామి వివేకానంద

# 10

హిందువు హిందువుగా ఉండేంత వరకే అతడు భారత దేశ రక్షణార్థం తన ప్రాణాలనైనా అర్పించి సర్వాస్వాన్ని హోమం చేయ గలడు. ప్రియమైన మాతృ భూమి కోసం అతడు తన ప్రాణార్పణ చేయడం ద్వారానే స్వర్గాన్ని లేదా మోక్షాన్ని కోరుకుంటాడు. కానీ అతడే మతం మార్చుకొని ఏ ముస్లిమో. క్రైస్తవుడో అయితే యిక ఈ మట్టి దిబ్బలను రక్షించడానికి తన ప్రాణాలెందుకిస్తాడు? అతనికి పుణ్య భూమి కూడా కాశీకాక మక్కా మదినా అవుతుంది. కనుక ఈ దేశం యొక్క రాష్ట్రీయుడు, అసలైన భక్తుడు హిందువేనని స్పష్టంగా అర్థం చేసుకోవాలి.

—వీరసావర్కార్

# 11

ఇతర విషయాల వలెనే మతం మార్పిడి కూడా ఈ రోజుల్లో ఒక వ్యాపారంగా తయారయింది. క్రైస్తవ మత ప్రచారకుల నివేదిక ఒకటి ఇటీవల చదివినట్లు నాకు జ్ఞాపకం. అందులో ఒక్కొక్క వ్యక్తిని మతం మార్చడానికి ఎంత ఖర్చు అయిందో పేర్కొంటూ "వచ్చే పంటకు" అవసరమైన బడ్జెట్టు కూడా ప్రతిపాదించబడినది. ఇలాంటి మతం మార్పిడులు ఈ హిందూ దేశంలో అవసరం లేదు. మతం మార్పిడి అనేది ఆత్మశుద్ధి, ఆత్మ సాక్షాత్కారం అనే అర్థంలో జరగడం నేటి ప్రధాన అవసరం. కాని మతం మార్పిడి చేసే వారి ఉద్దేశ్యమే వేరు. భారత దేశంలో మతం మార్పిడులు జరపాలనుకొనే వారితో నిష్కర్షగా "వైద్య మహాశయా! ముందు మీ జబ్బు నయం చేసుకోండి" అని చెప్పలేమా?

—మహాత్మాగాంధి

## 12

భారతదేశంలోని ముస్లింలలో చాల మంది పరిస్థితులకు లోనై పూర్వమెప్పుడో హిందూధర్మాన్ని వదలి ఇస్లాం మతాన్ని స్వీకరించిన వారే ఉన్నారు. అనేక విషయాల్లో వారందరూ నేటికీ హిందువులే. స్వతంత్రము, సమృద్ధము, ప్రగతిశీలమునైన భారతదేశంలో వారు తమ ప్రాచీన ధర్మాన్ని, జీవన పద్ధతిని మళ్లీ అనుసరించినట్లయితే అది కేవలం సహజంగా జరిగే ప్రక్రియ మాత్రమే అవుతుంది.

—మహాత్మాగాంధీ

## 13

ఇతరులను తమవారిగా చేసుకోవాలంటే ఎంతోసామర్థ్యం అవసరం. ఎదుటివారి మధ్యకు చొచ్చుకొనిపోయేశక్తి-వారిని పూర్తిగా ఆత్మీయులుగా మలచుకోగలిగిన చాతుర్యం-ఇవే సామర్థ్యం అంటే. ఈ ప్రతిభ మనకు భారతదేశంలో కన్పిస్తుంది. భారతదేశం ఎట్టి సంకోచమూ లేకుండా ఇతరుల మధ్యకు చొచ్చుకొనిపోయి వారి ప్రత్యేకతలను సునాయాసంగా స్వంతం చేసుకుంది. విదేశీయులు "విగ్రహారాధన" గా పేర్కొన్నదానిని గురించి భారతదేశం భయపడనూలేదు, దానిని తిరస్కరించనూలేదు. పుళిందులు, శబరులు, వ్యాధులు మొదలైన వారినుండికూడా క్షుద్రసాంప్రదాయాలను భారతదేశం గ్రహించింది. వాటిలో తన భావాలను చెప్పించింది. తనదైన ఆధ్యాత్మిక తత్త్వాన్ని వాటిలో వ్యక్తపరచింది. భారతదేశం దేనిని త్యజించలేదు. అన్నింటినీ గ్రహించి స్వతం చేసుకుంది.

—రవీంద్రనాథ ఠాకూర్

## 14

భారతదేశం ఏ విలువల కోసం పోరాడుతున్నదో అవి కేవలం భారతదేశానికే కాదు, సమస్త ప్రపంచానికీ చెందినవి. ఆధునికతలోని శక్తినీ ప్రాచీనతలోనిసంతృప్తిని మేళవించాలనిమనంకోరుతున్నాం. విజ్ఞాన శాస్త్రం ఆధారంగా ప్రపంచంలో అభివృద్ధి చెందిన దేశాలు మరింత శక్తి వంతము అవుతున్నాయి. కాని ఒకవైపున శక్తిసామర్థ్యాలు పెరుగుతున్న ప్పటికీ మరోవైపున వాటిలోసుఖసంతోషాలు కరువైపోతున్నాయి. భారత దేశంలో మనం శాస్త్రీయాభివృద్ధిని సాధించికూడా దానికిబానిసలం కాకుండా ఉండే మార్గాన్ని కనిపెట్టాలి. మన శక్తి, మన సంపద తప్పక పెరగా ల్సిందే. కాని ధనం యెడల వెర్రివ్యామోహం ఉండకూడదు.

-రాష్ట్రకవి రామధారీ సింహ దినకర్

## 15

"ఆర్య" లేదా "హిందు" అన్న పేర్లతో వ్యవహరింప బడేదే భారతీయ సంస్కృతి యొక్క పడుగు. ఇది నిర్వివాదం. అటునుండి, ఇటునుండి పేకల ద్వారా వచ్చే నూలు పోగులన్నీ ఆ పడుగునే ఆధారం చేసుకుంటాయి. అనేక ఉపనదులు, చిన్నవి పెద్దవి, వచ్చి గంగా నదిలో కలుస్తుంటాయి. అన్నీ కలిసి రూపొందే ఆ ప్రవాహాన్ని 'గంగా' అనే అంటారు. ఈ న్యాయాన్ని అనుసరించి భారతీయ సంస్కృతినే హిందూ సంస్కృతి అనికూడా అంటారు. భారతీయ దర్శనాలను గురించి చర్చించే వారి మనస్సులలో మెదిలేవి ఆర్యదర్శనాత్మైన సాంఖ్య, యోగ, వేదాం తాదులు అయినట్లే, భారతదేశానికి ఆవల భారతీయ సంస్కృతిని గురించి మాట్లాడే వారి దృష్టిలో ఈ సంస్కృతి యొక్క ముఖ్యప్రవాహమే ఉండటం నిస్సంశయం.

-డా॥ సంపూర్ణానంద్

# 16

నూతన ఆదర్శాలకనుగుణంగా జీవితాన్ని మలచుకోవాలంటే గిరి గీసుకుని కూర్చోకుండా కాలదోషం పట్టిన వాటిని కాలదన్ని బయటపడాలి. పాశ్చాత్యదేశాలు ఎప్పుడూ క్రొత్తవాటిని వెతకడంలో నిమగ్నమైనాయి. అందుకేవారు ఉన్నతిని సాధించారు. కాని మనం "ఇది మనకు తెలియదే అన్న భయంవల్ల వెనుకంజ వేస్తాము. బయటకంటె ఇంట్లోపడిఉండటమే బాగుందలెమ్మని అనుకుంటాం. అందుకే మనలో సాహసప్రవృత్తి" (Spirit of advention) చాలా తక్కువ. కాని ఈ సాహస ప్రవృత్తే ఏ జాతి యొక్క విసతికైనా ముఖ్య కారణం.

-నేతాజీ సుభాష్ చంద్రబోస్

# 17

మనధర్మానికి ఆధారస్థంభాలవంటి విషయాలపై మనకునిష్టఉండేనే తీవ్రమైన మార్పులకు మనం సిద్ధంగా ఉంటాం. మన మాటలకు, చేతలకు మధ్యఉండే అగాథాన్ని మనం పూడ్చివేయటానికి ప్రయత్నించాలి. ప్రజలను పట్టిపీడిస్తున్న సాంఘికదురాచారాలను రూపుమాపడానికై నిరంతరం దేశ మంతటా విస్తృత ప్రచారం కొనసాగించాలి. మానవ నిర్మితమయిన అసమానతలు, అన్యాయాలన్నింటినీ రూపుమాపి సమాజాన్ని శుద్ధిచేయ డమే గాక అందరికీ వ్యక్తిగతమైన సుఖం, సామాజిక వికాసం సాధించేందుకు తగిన అవకాశం లభింపజేయాలి.

-డా॥ రాధాకృష్ణన్

## 18

ఆవశ్యకమైన జీవశక్తి పూర్తిగా లోపించి సమాజం యొక్క పరిస్థితి నేడు మరీ విచిత్రంగా తయారయింది. ఈ విషయంలో మనం బాగా ఆలోచించాల్సి ఉంది. పాకీవాని వంశంలోని ప్రతితరమూ అలాగే సమాజపు మలమూత్రాలను గంపలతో ఎత్తుతూ ఉండడం గాని లేదా "సమాజపు మురికిని చివరకు ఎవరో ఒకరు ఎత్తవల్సిందే కదా! నా పెద్దలు పది తరాలపాటు ఈ పనే చేశారు కనుక ఇకముందు నాకు కలగబోయే సంతానం కూడా ఇదే పని చేస్తుండాలి" అని ఒక పాకీవాడు అనుకోవడం గాని ఇప్పుడిక అసంభవం. ప్రపంచంలో మార్పుకై పని చేస్తున్న శక్తులన్నింటిని గురించి తెలుసు కొని ఉండడం, వాటిని గమనిస్తూ ఉండడం ఎంతో అవసరం. పరిస్థితులను బట్టి ఆమూలాగ్రంగా కూడా కొన్ని మార్పులు చేయవలసి వస్తుంది.

## 19

మనలో సమృద్ధి ఉన్నట్లయితే అందరిని సంఘటిత మొనర్చేందుకు మనం ప్రయత్నించాలి. మనం ఆలోచించుకోవలసిన సమయం వచ్చినది. ఒక మనిషితాకితే అపవిత్రమైపోతామని మనం అనుకుంటున్నాం. మనిషి తాకితే దేవుడు కూడా మైలపడిపోతాడని మ ం ఊహించుకొంటున్నాం. ఇ భగవత్తత్వాన్నే నిందించడమవుతుంద [illegible] వివేకం మనలో లేక [illegible]యింది. సమస్త విశ్వానికి నాథు [illegible] వా [illegible] అర్పించడానికి పూజా [illegible] లు తీసుకొనివచ్చి కూడా ఆ [illegible] శ నా [illegible] ందకుండా విశ్వాదా [illegible] మూసివేసి అవమానిస్తున్నా [illegible]. ఒ [illegible] ని కి ఒక ముద్రవేసి [illegible] హీనుడని చెప్పడం పుణ్య [illegible]ర్యమ [illegible] ందా?

 ంద్రనాథ ఠాకూర్

# 20

మానవ జీవితం యొక్క పరిణామంలో ఈనాడు మనం ఒక మలుపు వద్దకు వచ్చాం. ఇందులో ఏ సంకల్పాలకు బీజారోపణ జరిపినా ఏ ప్రయోగాలు జరిపినా, ఎట్టి ప్రేరణలతో వాటిని అమలు జరిపినా అవి ఒక భవ్యము, వ్యాపకము, తేజోవంతము ఐన సంస్కృతిగా రూపొందుతాయి. కాని దీనికై శ్రద్ధాభక్తి సంపన్నులైన కర్మవీరుల అవసరం ఉంది. వ్యక్తి క్షుద్రమైన కోరికలకు, తుచ్ఛమైన ఆదర్శాలకు లోబడకూడదు. శాస్త్రీయ నిష్ఠతోను, సన్యాసిని వలె నిస్సంగభావనతోను తన ముందున్న మహోన్నత ధర్మాలకోసం ప్రాణాలను సైతం బలి యివ్వడానికి సిద్ధపడాలి. లేకపోతే ఈ అవకాశం కాస్తా చేజారి పోతుంది. వ్యక్తి పెనుతుఫానులో సయితం సముద్రంతో దూక సాహసించిననాడు, తన ప్రాణాలను పణంగా ఒడ్డడానికి కూడా సిద్ధపడిననాడు ఇంత వర కెన్నడూ ఊహించని ఒక మహోన్నతమైన సంస్కృతికీ, అత్యంతపు యిన ప్రగతికీ అధికారి అవుతాడు.

-కాకా కాలేల్కర్

# 21

తమదేశం పైన, తమ జాతీయుంపైన తప్ప వేరొకరిపై అభిమానం లేనివారు, తమ ధర్మరక్షణకంటె వేరొక కర్తవ్యము లేనివారు, హిందూధర్మాన్ని రక్షించి, హిందూరాష్ట్రిభానుని ఉజ్వలం చేయడం తప మరే స్వార్థచింత లేనివారు-అట్టి వ్యక్తులకు భయోత్పాతాన్ని గాని, మః స్తాపాన్ని గాని, నిరుత్సాహాన్ని గాని కలిగించగల సామర్థ్యం లోకంలో ఎవ్వరికీ ఉండజాలదు...

—డా॥ హెడ్గేవార్

## 22

దేశసేవ మాటలతో తేలేదికాదు. అది మానవుని శ్రేష్ఠమైన తపస్సు. అక్కడ స్వార్థం మచ్చుకైన ఉండదు. పేరు ప్రతిష్ఠలకై తాపత్రయం ఉండదు. ప్రాణభీతి అసలే ఉండదు. దేశానికీ, దేశభక్తునికీ మధ్య ఏదీ అడ్డురాదు. తన కీర్తిని ధనాన్ని, సుఖదుఃఖాలను, పాపపుణ్యాలను, మంచి చెడ్డలను అన్నింటిని దేశం కోసం అర్పణ చేయగలవాడే దేశసేవ చేయగలడు.

—శ్రీ శరచ్చంద్రచటర్జీ

## 23

మన ప్రాచీనతయెడగల గౌరవంతో మనం పరవశిస్తాం. కాని భారతీయ జీవనంలో సర్వోత్కృష్టమయిన దంతా అక్కడే ఉన్నదని భావించం. వర్తమానం విషయంలో మనం యధార్థవాదులం. కాని అందులోనే కూరుకొని పోము. అలాగే మనం భవిష్యత్తును గూర్చిన బంగారు కలలు కంటున్నాం. అయితే వాటికారణంగా నిద్రావస్థలోకి జారిపోము. మనం కలలోని విషయాలను ఇలలోకి తెచ్చుకొనే జాగరూ కులమైన కర్మయోగులం. అనాది అయినా గతం, అస్థిరమైన వర్తమానం, అనంతమయిన భవిష్యత్తుకు చెందిన చిరంతన సంస్కృతి యొక్క ఆధారకులం.

—పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ

## 24

సమాజంలో సర్వాంగీణ సౌఖ్యానికీ, సర్వరంగాలను తీర్చి దిద్దడానికి మాత్రమే సంఘం ఆవిర్భవించింది. అందువల్ల స్వయంసేవకులు

అన్ని రంగాలలోనికి చొచ్చుకొనిపోవాలి. అన్ని వైపులా వారి ప్రభావం ప్రసరించాలి. సంఘస్థాన్‌లో కేవలము దక్ష-ఆరమ చేస్తూ ఉండటానికే సంఘం నిర్మాణం కాలేదు. సంఘం నేడు శాఖాకార్యక్రమాలకు మాత్రమే పరిమితమై లేదు. సంఘస్థాన్, సంఘశాఖ— ఇవి కేవలం ఆధారాలు మాత్రమే. వీటి ఆధారంగా మనం సంపూర్ణ సమాజంలో విస్తరించుకు పోవాలి.

## 25

తాత్కాలికమైన సమస్యలపట్ల సంఘంయొక్క దృష్టి కోణమేమంటే- మన నికరమైన శక్తి ఆధారంగా సహజంగా సమాజాన్ని ఏ మేరకు మన వెంట తోడ్కొని పోగలమో ఆ మేరకే ఆయా సమస్యలను పరిష్కరించే ప్రయత్నం చేయాలి. ఎక్కడ ఏ సమస్య వచ్చిపడినా దానికై సంఘం తన యావచ్ఛక్తినీ వినియోగించాలని ప్రజలు ఆశిస్తారు. కాదు అంటే 'మరి ఈ సంఘటన ఎందుకు నిర్మాణం చేసినట్లు?'అని వారికిఅనిపిస్తుంది. ఈ విషయంలో మనకు స్పష్టమైన కల్పన ఉండాలి. మనలో ఉన్న శక్తి మేరకే ఆయా సమస్యలను పరిష్కరించడం మనకు సాధ్యపడుతుంది. సమాజంలోని ఇతర వ్యక్తులను కలుపుకొని ఈ శక్తిని మనం మరింత పెంచుకోవాలి.

## 26

మన గుణగణాలు వ్యక్తి జీవితంలో సువ్యక్తం కావడమేకాక సమిష్టి జీవనంలో ఆచరణయోగ్యమైన పద్ధతిలో సుస్పష్టం కావాలి. ఇది అత్యంత ఆవశ్యకం. దీని కోసం వ్యక్తులు ఒకరితో ఒకరు తాదాత్మ్యాన్ని పొందుతూ సమిష్టితో కూడా సమరసం కావాలి. స్నేహపూరితము,

విశ్వాససహితము, ఆదరయుక్తము ఆయి పరిపూర్ణమైన ఆచరణ మన జీవితంలో ప్రస్ఫుటం కావాలి. ఇందులో సాఫల్యాన్ని పొందితీరాలి. ఇట్టి తేజోవంతమైన కార్యానికి బాహ్య పరిస్థితుల వల్ల అడ్డంకులు ఏర్పడడం అసంభవం. ఇది నా ప్రగాఢ విశ్వాసము. ఈ విశ్వాసాన్ని మీ అంతః కరణలలో కూడ ప్రతిష్ఠించుకోండి. మన కార్యము విజయవంతమైతీరాలి, అయితీరుతుంది, శక్తి సంపన్నం కూడా అవుతుంది. అప్పుడు ఎల్లెడల సంఘ కార్యానికి జేజేలు పలుకుతారు. మన భారతదేశాన్ని ఏ విధంగా తీర్చిదిద్దాలని ఆశిస్తున్నామో ఆ విధంగానే రూపొందితీరుతుంది.

—ప॥ పూ॥ శ్రీ గురూజీ

## 27

హిందూ సమాజాన్ని సంఘటితపరచాలి అని సంఘకార్యం మొదలైన నాటినుండి చెబుతూనే ఉన్నాం. హిందూ దేశానికి హిందూసమాజమే వెన్నెముక. హిందూ సమాజమే మూలాధారం. కనుక ఈ భూమిపైన ఒక జాతిగా నిలచిఉండే బాధ్యత హిందూ సమాజానిదే. హిందూ జాతి ఇక్కడ ఒక జాతిగా నిలబడాలి. కేవలము జీవించి ఉండటమే కాదు. వైభవోపేతంగా, నిర్భయంగా, స్వేచ్ఛగా జీవించగలగాలి. నిజానికి స్వాతంత్ర్యం అంటే ఇదే.

—పూజ్యశ్రీ గురూజీ

## 28

హిందూ దేశమంటే హిందువుల దేశం. హిందూ దేశమంటే ఈ భూమికి, ఈ భూమిపైన నివసించే ప్రజాసమూహానికి కలిపి అన్వయించే పేరు. దీనినే భారతజాతి అనికూడా అంటారు.

గంగానదిలోకి వచ్చి కలిసే ఏరులన్నీ గంగానీరుగానే మారిపోయి నట్లుగా, తరతరాలుగా ఇక్కడ నివసిస్తున్న ప్రజలు కూడా ఇచ్చటి జాతీయ జీవనంలో కలిసిపోయారు. క్రైస్తవులు గానీ, పార్శీలు గాని ముస్లింలుగానీ, వాళ్ళు ఏ కుదురులో నుండి వచ్చినా ఏ యిష్టదైవాన్ని ఆరాధించినా ఈ భూమిపైన పుట్టిపెరిగి పెద్దవాడైన కారణంగా ఇదేతనకు ఆరాధ్య దైవంగా భావించే ప్రతి వ్యక్తి, ఈ భారతజాతి యొక్క అవయవ స్వరూపుడుగా భావించడానికి అర్హుడే. అవిభాజ్యము, అనంతమునైన, ఈ దేశ మొక్కటే.

—శ్రీ సుబ్రహ్మణ్య భారతి

## 29

'హిందు' అనే శబ్దాన్ని మనం ఒక ప్రత్యేకమయిన మతాన్ని సూచించే శబ్దంగా ప్రయోగించడం ఏ మాత్రం తగదు. అలా చేస్తే 'హిందూ' శబ్దాని కున్న సర్వసంగ్రాహకమయిన అర్థాన్ని కుంచింపచేసిన వారమౌతాము. కాని సనాతనులమని, శృతి, స్మృతి, పురాణోక్తమయిన సనాతన ధర్మాన్ని అనుష్ఠిస్తున్నామని చెప్పుకునే మన సోదరులే ఈ పొరపాటు చేస్తున్నారు. హిందూ ధర్మం అంటే కేవలం వైదిక ధర్మం లేక పౌరాణిక ధర్మం అని చెప్పి దానిని పరిమితం చేస్తున్నారు. ఇంతేకాదు— 'హిందువులు-శిఖులు', 'హిందువులు-జైనులు', 'హిందువులు-బ్రహ్మసమాజీయులు' ఇలాఅపార్థాన్ని, అనర్థాన్ని కలిగించే పదప్రయోగాలతోజైనులు, శిఖులు మొదలైనవారు హిందువులు కారని మనమే అంటున్నాం. ఆ విధంగా వారిలో చెడు సంస్కారాలను మనమే నిర్మిస్తున్నాం. కాని పైకి మాత్రం 'మీ పే హిందువులతో వ్రాయించండి' అని చెబుతున్నాం. తెలియకచేసేదే యినప్పటికీ ఆత్మ హత్య సదృశమయిన ఈ తప్పిదాన్ని మనం తక్షణమే దిదిద్దుకోవలసి ఉంది.

—వీరసావర్కర్

## 30

సమానమైన ఒక ఉన్నత ఆదర్శాన్ని ముందుంచుకొన్న మన మందరమూ సంఘటితం కావాలి. ఈ సంఘటన ద్వారా చీకట్లను పార ద్రోలి వినాశానికి కారణ భూతమయిన వ్యతిరేక శక్తు లన్నింటినీ ఎదిరిద్దాం. నిజానికి సంఘటనలోనే విజయం ఉంది.

–శ్రీ మాత

## 31

హృదయాన్ని జయించడం, హృదయాన్ని మరొక హృదయంతో కలపటం, వ్యక్తిగత విషయాలను పూర్తిగా మరచిపోవడం ఇదే సంఘటన అంటే. జాతిలో వ్యక్తి విలీనం కావడంలోనే జాతి యొక్క క్షేమం ఆధారపడి ఉంటుంది. బాగా అధ్యయనం చేస్తే ఇది మనకు అనుభవం లోనికి వస్తుంది. అల్పమైన వ్యక్తిత్వమే మన కష్టా లన్నింటికీ మూల కారణం. వ్యక్తిత్వం నష్టం కావడం అంటే మరణించడం కాదు, విక సించడమే. వ్యక్తిగా ఉన్న మనం జాతిగా వికసిస్తాం. యావత్తు జాతి యొక్క సుఖదుఃఖాలలో మనం కూడ పాలు పంచుకున్నట్లయితే దానివల్ల మనలో ఎంతో గొప్ప వికాసం వస్తుంది.

–ప॥ పూ॥ శ్రీ గురూజీ

## 32

సంఘటనా శాస్త్రంలో సహకారానికీ, మోసానికీ బల ప్రయోగా నికీ, వ్యక్తిగతమైన ఆధిక్యతకు ఏ మాత్రం చోటు ఉండడానికి వీలులేదు. వ్యక్తిగత మమకార, అహంకారాలకు అవకాశ మీయలేదన్న విషయాన్ని

సంఘటన అనే శబ్దమే స్ఫురింపచేస్తుంది. అయితే దీనితోపాటు ఆదర్శ వ్యక్తికుండ వలసిన సద్గుణాలు సంఘటన కొరకు తప్పని సరిగా ఉండ వలసిందే. ఇతర రంగాలలో అయితే మీలోని సద్గుణాల కారణంగా ఎన్నో రకాల గౌరవం లభిస్తుంది. ఆ గుణాల కారణంగా మీకు కీర్తి ప్రతిష్టలు లభిస్తాయి. సందేహం లేదు. కాని మీరు మీ స్వరూపాన్ని సంఘటనా కార్యం కొరకు సమర్పించినపుడే ఆయా గుణ గణాలకు నిజమైన సార్థకత లభిస్తుంది. "

—డా॥ హెడగేవర్

# 33

వాస్తవికత అనే బురదలో నుండే జీవన కమలం ఉద్భవిస్తుంది. కాని 'ధ్యేయం' అనే సూర్యరశ్మి సహాయంతో మాత్రమే అది కర్మమయ జీవనము యొక్క ఉపరితలాన్ని చీల్చుకొని పైకి వచ్చి తన స్వచ్ఛ పరిమళాలను వెదజల్ల గలుగుతుంది. కాలుష్యంతో కూడి ఉన్న ప్పటికీ బురద పోషణనిస్తుంది. అట్టి బురద నుంచి వేరు చేస్తే నీళ్ళలో తేలుతూ ఉన్నప్పటికీ అది కుళ్ళి పోతుంది. మరి సూర్యరశ్మి ఏ మాత్రం తగలకుండా చేస్తే కమలం వికసించదు. వాస్తవిక దృక్పథం ప్రాణ ప్రధానమైనదే! కాని ధ్యేయవాద దృక్పథం ప్రాణప్రదము మాత్రమే కాదు. జీవన సాఫల్యాన్ని కూడ సమకూరుస్తుంది.

—కాకా కాలేల్కర్

# 34

కులాలు, మతాలు, భాషలు భౌగోళిక పరిస్థితులు మొదలైన వానిలో ఎంతో విభిన్నత ఉన్నప్పటికీ కొన్ని శక్తులు గతంలో మన

ప్రజలను ఒక జాతిగా నిలిపి ఉంచాయి. ఇక ముందు కూడా ఈ జాతిని ఐక్యతా సూత్రంలో బంధించి ఉంచగలుగుతాయి. వీటి స్వరూపం స్పష్టమౌతూనే ఉన్నది. ఈ శక్తులు భౌతిక క్షేత్రానికి సంబంధించినవి కావు. మన ఐక్యత కేవలం భూగోళ సంబంధమైనది కాదు. ఇది భావాత్మకమైన ఐక్యత. కేంద్ర బిందువైన ఈ భావైక్యత దెబ్బతిన్న ప్రతిసందర్భములోను దానిదుష్ఫలితాలను మనం అనుభవిస్తూనే వచ్చాము. మన విదేశీ దాస్యానికి కారణము మన అనైక్యతే! ఇందువల్ల భాష, మతం, ప్రాంతం మొదలయిన వారి పేరిట విభేదాలను సృష్టించే ఆలోచనలకు మనం స్వస్తి చెప్పాలి.

—రాధాకృష్ణన్

కాన్వకేషన్ ఉపన్యాసం. 16– 12– 53

పంజాబ్ విశ్వవిద్యాలయం.

# 35

శతాబ్దాల తరబడి బానిసత్వంలో మ్రగ్గిన కారణాన మనలో కొన్ని వికృతులు, ఉచ్చనీచ భావాలు, ఆర్థిక వైషమ్యాలు, వెనుకబడినతనం కులతత్వం మొదలైనవి ప్రవేశించే ఉండవచ్చు. కాని వీటిని వెచ్చగొట్టి మన అస్థిత్వానికే భంగం కలిగించేందుకు విదేశీయులు ఎవరైనా ప్రయత్నిస్తే వారిని మనం సహించేది లేదు. వారి కుట్రలను మనం వమ్ము చేస్తాం. ఇది మన గృహచ్ఛిద్రము. మన ఇంటి గొడవ. దీనిని మనలో మనమే సర్దుకోగలము. మన లాభము కోసమో సామాజిక దృష్ట్యా క్రింది స్థాయి నుండి పైకి రావాలనే కోరికతోనో మనం విదేశీ తొత్తులం కాబోము. మనలో నుండి బయల్దేరే జయచంద్రుల పట్ల మనం అప్రమత్తులమై ఉండాలి. ఈ జాతికి, ఈ సమాజానికి మనం అవయవ

స్వరూపులం. మన సమాజానికి హితం కలుగజేసే దాన్ని మనం ఆచరించాలి.

—శ్రీ బాబాసాహెబ్ అంబేత్కర్

# 36

జాతీయ స్వాభిమానం అనేది ఏ స్వతంత్ర దేశానికైనా తక్కువ ప్రాముఖ్యం కలిగిన విషయం కాదు. స్వాభిమానంలో మమకారం దాగి ఉంటుంది. ఇది నాది అన్న దాంట్లోనే పని చేసేందుకు ప్రేరణ ఇమిడి ఉంటుంది. దానిని అహం (నేను) అని అంటారు. ఒక జాతి లోన వ్యక్తులను ఈ "అహం" తత్త్వమే క్రొత్త విషయాలను కనుగొనడానికి క్రొత్త దారిని నిర్మించడానికి ప్రేరణ ఇస్తుంది. సంకట పరిస్థితులు ఏర్పడినపుడు దీని ఆధారంగానే ఒక స్వతంత్ర జాతి సాహసోపేతమైన చారిత్రాత్మకమైన నిర్ణయాలు తీసుకోగలుగుతుంది. దీనిని ఇట్టి విదేశీయ వాదులను, సిద్ధాంతాలను స్వీకరుస్తూ పోవడం జాతీయ స్వాభిమానానికి అనుకూలమైన విషయం కాదని అంగీకరించక తప్పదు.

—దీనదయాళ్ ఉపాధ్యాయ

# 37

"మనం భారతీయులుగానే ఉండాలి. అభారతీయులుగా మారకూడదు" అన్నది ఈశ్వరేచ్ఛ. మనం స్వీయ తత్త్వాన్ని విస్మరించడానికి భిన్నమైన అన్యతత్త్వాన్ని ఆశ్రయించాం. దానికి చెందిన నియమాలను అనుసరిస్తూ ఆవిధంగా మన జీవితాన్ని బాగు చేసుకోగలమని ప్రయత్నించాలి. మనం యిట్టి మార్గాన్ని వదిలి పెట్టాలి. మన జీవనానికి

మన శక్తికి మూలం- కందం మనలోనే ఉంది. దానిని మనం గుర్తించాలి. మన గతాన్ని గురించిన జ్ఞానాన్ని సముపార్జించాలి. మన భవిష్యత్తును నిర్మించుకోవడానికి దానినే మనం వినియోగించుకోవాలి.

—యోగి అరవింద

## 38

సామ్యవాదం కాని సమాజవాదం కాదు (కమ్యూనిజం, సోషలిజం) పురోగతి కాదు. అది తిరోగతి. దీని కారణంగా మనిషి దిగజారి పోతు న్నాడు. మానవుని వికాసక్రమం ఏ మాత్రం అధ్యయనం చేసినా ఈ సంగతి స్పష్టమౌతుంది. మనిషి ప్రాథమిక స్థాయిలో యున్నప్పుడు భౌతిక విషయాలను మాత్రమే ఆలోచిస్తాడు. అందులోనే ఆనందాన్ని అనుభవిస్తాడు. కాని దానితో విసుగెత్తిపోయి క్రమంగా మానసిక స్థాయిని చేరుకుంటాడు. రకరకాల మానసిక కార్యకలాపాలలో మునిగి తేలుతాడు. తర్వాత శారీరక స్థాయిని దాని బౌద్ధిక స్థాయిని అందుకొని అనేక రీతులలో ప్రగతిని సాధిస్తాడు. దానిని సైతము అధిగమించి బుద్ధికి అతీతంగా ఉన్న పరమాత్మ తత్త్వాన్ని కూడ చేరు కుంటాడు. ఇది మానవుని నిజమైన ప్రగతి.

—పూజ్యశ్రీ గురూజీ

## 39

జీవించటానికి ఆహారము అవసరమే. అంత మాత్రాన ఆహారము తీసుకొనే వారెవరూ మరణించరని అర్థం కాదు. అయితే తిండి తినే ప్రతి వాడూ ఏదో ఒక రోజున మరణిస్తాడు. కనుక "నేను తిండే తినను" అని చెప్పి ఎవరైనా పస్తులుండటం మొదలు పెడితే పర్యవసానం

ఏమవుతుంది? సారాంశమేమిటంటే తిండి తినకంత మాత్రాన చావు రాదు. తిండి మానేసినంత మాత్రాన అమరత్వమూ రాదు. జీవించి ఉండ టానికి తిండి తినక తప్పదు. కాని మనిషి శాశ్వతుడు కావాలంటే మాత్రం శారీరాన్ని సత్కార్యాచరణకై వినియోగించాలి. కాని బ్రతికియుండడానికి ఆహారం అవసరం. అయితే అమరత్వాన్ని పొందేందుకు మనిషి సమిష్టిని ఆశ్రయించడం అవసరం.

—దీనదయాళ్ ఉపాధ్యాయ

## 40

"సాధన" అంటే అర్థం మానవ జీవితం రూపాంతరం చెందడం. రూపాంతరం చెందాలంటే బాహ్యమైన మార్పుల వల్ల ప్రయోజనం లేదు. మానవ జీవితానికి ఆదర్శాలు నవ చైతన్యాన్ని కల్గించాలి. ఆదర్శాలను అనుసరించడంలో తనను తాను ఆహుతి చేసుకోవలసి ఉంటుంది. ఆదర్శమనే బలి వేదిక పైన బలిదానం అయినప్పుడే మనిషి యొక్క మాటలలో, చేతలలో, ఆలోచనలలో ఏకసూత్రం వస్తుంది. అప్పుడే అంతర్ బాహ్యములు ఒకే పద్ధతిలో ఉంటాయి. అతని జీవితమంతా ఒకే సూత్రం వ్యాపించి ఉంటుంది. అ వ్యక్తి జీవితంలో ఒక క్రొత్త రుచిని, ఒక క్రొత్త ఆనందాన్ని, జీవితానికి ఒక క్రొత్త అర్థాన్ని అన్వేషించ గలుగుతాడు. అతనికి సమస్త ప్రపంచం ఒక క్రొత్త వెలుగులో సాక్షాత్కరిస్తుంది.

—నేతాజీ సుభాష్‌చంద్రబోస్

## 41

తాను స్వీకరించిన సిద్ధాంతాలకు అనుగుణంగా జీవితంలో ప్రతి అడుగు వేసే వ్యక్తి మాత్రమే వందనీయుడుగా, అనుకరణీయుడుగా

భావించబడతాడు. ఆచరణలో పెట్టని సిద్ధాంత నిష్ఠ కుంటిదై పోతుంది. ఒట్టి బడాయి మాటలవల్ల, ఆచరణలో పెట్టని సిద్ధాంతాలవల్ల ఏ కార్యమూ ఇంతవరకూ సాధించబడలేదు. ఇకముందు కూడా ఎన్నడూ సాధించ బడబోదు. రాష్ట్రీయ స్వయంసేవక సంఘానికి గౌరవంతేవాలంటే ప్రజల హృదయాలలో సంఘకార్యము ఎడ గౌరవం ఏర్పడాలి. అంటే సంఘ కార్యాన్ని సువ్యవస్థితమైన రూపంలో ముందుకు తీసుకొని పోవాలనే ఆకాంక్ష మనలో ఉన్నట్లయితే సంఘ సిద్ధాంతానికి స్వయం సేవకుల ప్రవర్తనకు నడుమ సమన్వయాన్ని సాధించితీరాల్సిందే.

-ప॥ పూ॥ డాక్టర్ హెడ్గేవార్

# 42

మనలో ప్రతి స్వయంసేవక్ ఇతరులు అనుసరించదగిన ఆదర్శ వ్యక్తిగా వుండాలి. "ఇతడు తనను తాను దేశానికి సమర్పించుకున్న వ్యక్తి, పవిత్రుడు, సౌశీల్యవంతుడు, ధర్మనిష్ఠ కలిగిన వ్యక్తి. అందుచేత ఇతడు చేసే పనులన్నీ నిష్కళంకంగా ఉంటాయి" అని అందరికీ అని పించాలి. ఇటువంటి ఆదర్శవంతులైన స్వయంసేవకులు సంఘటిత మైనప్పుడు అనుశాసనములో ఉన్నప్పుడు దేశంలోని వాతావరణంమొత్తం మారిపోతుంది. మనం చేయవలసినది ఇదే.

-పూజ్యశ్రీ గురూజీ

# 43

ఒక మహోన్నత లక్ష్యం సాధించడంలో మనం ఉపకరణాలం కావాలి. ఆదర్శ దేవత చేతి ఆటవస్తువులం కావాలి. ఆదర్శదేవతకు దాసులం కావాలి. ఇంతకు మించి శ్రేష్ఠమైన పదవి ఏం ఉంటుంది?

జీవితపు కంటకాకీర్ణమార్గంలో ధ్యేయం వైపుగా సాగుతూ పడుతూ లేస్తూ కుప్పకూలుతూ, కుస్తీలు పడుతూ, గెలుస్తూ, ఓడుతూ ముందుకు దూకుదాం, ఆగేది లేదు. భయపడేది లేదు. నిరాశా, నిస్పృహల నడుమ మృత్యుకీలల నడుమ ఆనంద తాండవనృత్యం చేస్తూ ముందుకు ముందుకు ఇంకా ముందుకు పోదాం పదండి. కీర్తి పతాకాన్ని ఎగురవేద్దాం పదండి.

**-సోదరి నివేదిత**

## 44

మన సమాజం అంతటినీ సంఘటితం చెయ్యాలంటే కేవలం ఆత్మీయత ఉంటే చాలదు. దానితో బాటుగా వ్యక్తిగతమైన అహంకారం వదిలి ఒకరితో ఒకరుకలిసి సూత్రబద్ధంగా సమాజంగా అంతటిశ్రేయస్సు కోసం పనిచేయవలసిన అవసరమున్నది. అంటే ఏమిటి? సమాజంపట్ల మనలో ఆత్మీయత ఉంది. సమాజంకోసం సమర్పించబడిన జీవితాలు మనవి. దానితోబాటు మనం పరస్పరం కలసిమెలసి ఉండాలి. అనుశాసన సూత్రంతో బంధింపబడి ఉండాలి. అట్టి జీవితాన్ని అలవరచుకోవాలి. ఇది అవసరం. దీని కోసం, అనుశాసన సూత్రాన్ని సాధించడం కోసం ప్రతిరోజు అందుకు అవసరమైన శిక్షణ పొందడం అనివార్యం.

**-పూజ్యశ్రీ గురూజీ**

## 45

శారీరక శ్రమ, ఆటపాటలు కేవలం యువకుల కోసమే అనే దురభిప్రాయం కొందరి మనస్సులలో తిష్ఠ వేసుకొని ఉన్నది. మరొక సమస్య కూడా ఉంది. శారీరక శ్రమ, ఉన్నత జీవనస్థాయి ఆ రెండూ పరస్పర విరుద్ధ విషయాలని ఎవరో వెర్రిమొర్రి ఆలోచనలను మనబుర్రల

కెక్కించారు. ప్రతి వ్యక్తి శారీరక శ్రమచేసి, వ్యాయామంచేసి శరీరాన్ని చురుకుగా ఆరోగ్యంగా ఉంచుకోవాలి. మనస్సులో చైతన్యం ఉంటే శరీరంలో చురుకుదనం ఉంటుంది. అలాగే శరీరంలో చైతన్యం ఉంటే మనస్సు కూడా చురుసుగా పని చేస్తుంది.

-శ్రీ సుబ్రహ్మణ్య భారతి

## 46

ఒకే ఆలోచన కలిగిన వ్యక్తులు ఒకే చోటికి వచ్చినపుడు వారితో పరస్పర కలహాలు ఏర్పడవచ్చు. స్పర్థల కారణంగా వారు పరస్పరము విడిపోవచ్చు కూడా! ఇట్టి స్థితిని అదుపులో పెట్టేందుకు "వ్యక్తిగతమైన స్పర్థను తొలగించడం" ఒక మంచి ఉపాయం. ధ్యేయనిష్ఠతోబాటుసంస్థాగతమైన ప్రేమ కూడా ఉన్నట్లయితే స్పర్థలు ఏర్పడినపుడు "నేను ఈ సంస్థకు దూరం కాను" అన్న ఆలోచన మనస్సులోకి వస్తుంది. కార్యకర్తల నడుమ సాన్నిహిత్యము, స్నేహసంబంధాలు ఉంటే సంస్థలనుండి విడిపోవడం తగాదాలు పడడం, దూరంగా ఉండడం అంత సులభంకాదు, చాలా కష్టం. వ్యక్తులనడుమ ఆత్మీయత, అనుబంధం ఈమేరకు నిర్మించుకోవడం మిక్కిలి ఆవశ్యకము.

## 47

ప్రతి క్షణం వృద్ధి చెందుతున్న శక్తితో సంఘం నిలద్రొక్కుకొని ఉండడం వల్ల మనం ఎదుర్కొంటున్న సమస్యలకు రెండు రకాలుగా సమాధానం చెప్పినట్లౌతుంది. ఒకటి అసలు సమస్యలే ఉత్పన్నం కావు. ఉత్పన్నమైన సమస్యలు మరింత జటిలంగా తయారు కావు. రెండు సమ

స్యలు ఏవైనా ఏర్పడినప్పటికీ మన శక్తి నుపయోగించి ప్రజలను సమైక్య పరచి వీలైనంత మేరకు ఆ సమస్యలను పరిష్కరించడంలో కృతకృత్యు లం కాగలం.

## 48

సాధారణమైన జీవితం గడుపుతున్న ఉద్యోగులు తమ తమ వృత్తి ఉద్యోగాలు చేసుకుంటూనే తమ తమ కుటుంబ భారాన్ని మోస్తూనే సర్వ విధాల సంఘకార్యాన్ని చేయడం మొదలు పెట్టినపుడు మాత్రమే సంఘా నికి సమాజంలో తగిన గౌరవస్థానం లభిస్తుంది. ప్రచారకుని గురించి "ఇతనికి పిల్లా పీచు ఎవరూలేరు, ఉద్యోగం, సద్యోగం, ఏమి లేదు" అని సమాజం లోని వ్యక్తులు అనవచ్చు కానీ అదే ఒక వకీలు లేదా డాక్టరు లేదా మరొక వృత్తిలో ఉండే వ్యక్తులు సంఘచాలక్ మొదలైన బాధ్యత లను స్వీకరించి పని చేస్తున్నప్పుడు దాని ప్రభావం సమాజం మీద ఉంటుంది. అందువల్ల ఇటువంటి స్థానిక కార్యకర్తలు వీలైనంత త్వరగా నిర్మాణం కావాలి.

## 49

రాజ్యాన్ని, ప్రభుత్వాధికారాన్ని సర్వ శక్తివంతమైన వానినిగా భావించి ప్రతి పనికి ప్రభుత్వం మీదికి దృష్టిసారించి ఎదురు తెన్నులు చూసే జాతి బానిసత్వం లోకి దిగజారి పోవడం ఖాయం. రాజ్యశక్తి ప్రబల మౌతున్న కొద్దీ ప్రజాతంత్రము బలహీనపడిపోతుంది. దీనికి సరైన ఉదాహరణ సోవియట్ రష్యా. అక్కడ గత 60 సం॥ముల కాలంలో సర్వాధికారాలను ప్రభుత్వానికిధారపోసి ప్రజలు దానిపైపూర్తిగా ఆధారపడి ఉండేలా చేశారు. తత్ఫలితంగా అక్కడ వ్యక్తి స్వాతంత్ర్యము

పూర్తిగా నశించి సమాజం యావత్తు బానిసగా తయారయింది. కానీ ప్రజలు ఒక జాగృత శక్తిగా ఉన్న దేశంలో ప్రభుత్వం యొక్క ఆటలు సాగవు. ప్రభుత్వం పైన అంకుశం ఉండేందుకు వీలవుతుంది.

## 50

గంగానది ప్రవహించే క్షేత్రాలు ఎప్పుడూ చవటి పర్రలుగా ఉండవు. భూమిని సుజలగా, సుఫలగా, సశ్యశ్యామలగా చేసేందుకు గంగానదీ జలాలను పంట కాలువల ద్వారా తీసుకువెళ్ళారు. అదేరకంగా సంఘగంగ ప్రవహించిన ప్రతిచోట ఆ చుట్టు ప్రక్కల ఉన్న హిందూ సమాజంలో పరివర్తన రాకుండా ఉండదు. సమాజం యొక్క ఐక్యతను [illegible]గతికి గొడ్డలిపెట్టుగా ఉండే ప్రవృత్తులు, ఆచారాలు, నమ్మకాలు మొద[illegible]న వన్నీ క్రమంగా అంతరించి పోతాయి. వాటి స్థానంలో ఆరోగ్యప్రద[illegible]మైన సామా[illegible] కార్య[illegible] లా[illegible]లకు సంజీవని ఔషధంగా ఉపకరించే దృక్ప[illegible]ం అలవ[illegible] ది [illegible] [illegible]యి నిర్మాణమౌతుంది. సమాజంలోని ఏ అంశము [illegible] బడ[illegible]గా మిగిలిపోదు. సమగ్ర పరివర్తనలతో కూడిన ద[illegible] [illegible]ం ప్రేరణ పొంది స్వయంసేవకులు అగ్రేసరులై ముందుకు సాగాలి.

## 51

"ఆశిష్ఠో బలిష్ఠో ద్రఢిష్ఠో మేధావి" అనగా దృఢమై, బలశాలియై, తీవ్రమేధాశక్తి కలిగి ఉత్సాహంతో కూడుకొనిఉన్న మనిషిమాత్రమే పరమేశ్వరుని చేరగలుగుతాడు" అని వేదంలో చెప్పబడింది. మీ భవిష్యత్తును నిర్ణయించుకొనే సమయమిదే ! ఇందువల్లనే మీరు యవ్వనోత్సాహంలో ఉన్న సమయంలో పని చేయండని నేను ఆహ్వానిస్తున్నాను. పని

చేసే సమయం ఇదే! ఇప్పుడే మీ భవితవ్యాన్ని నిర్ణయించుకోండి. పనిలో నిమగ్నులుకండి. నలిగి పోకుండా స్వచ్ఛంగా అనాఘ్రాతంగా ఉన్న పుష్పమే పరమేశ్వరుని చరణ కమలాలపై సమర్పించబడుతుంది. అటువంటి దానినే పరమేశ్వరుడు స్వీకరిస్తాడు.

—స్వామి వివేకానంద



"తమను తామే రక్షించుకోవాలి అని" ప్రజల అనుభవంలోకి తీసుకొని రావాలి. ఇది ఒక్కటే మార్గం. ఇందుకోసం పనిచేసే వ్యక్తులు కావాలి. వారు ప్రజల దుఃఖాలు తమవిగా భావించాలి. వారి సమస్యలను అర్థం చేసుకోవాలి. ఆ సమస్యల పరిష్కారంకోసం సరియైన మార్గాన్ని కనుగొని దానిని సుగమం చేయగలగాలి. ఆ మార్గంలో ప్రజలతో పాటు తామూ స్వయంగా పయనించి నిరాశతో కూడిన గాఢాంధకారంలో సైతము ఆశా కిరణాలను ప్రసరింప చేయగల్గిన ఆత్మ విశ్వాసాన్ని మేలుకొల్ప గలగాలి. ఇటువంటి వ్యక్తులు ఈ దేశంలో తగినంత సంఖ్యలో నిర్మాణం కావలసి యున్నది. సమాజ కార్య భారాన్ని తమ భుజస్కంధాలపై వేసుకొని పరిశ్రమించి దానిని ముందుకు తీసుకొని పోగల్గిన వ్యక్తి మాత్రమే సమాజంలో కొద్దిగానైనా ఆత్మ విశ్వాసాన్ని నిర్మాణం చేయగలడు. నిందించడంవల్ల, ఆడిపోసుకోవడంవల్ల, ఎగతాళి చేయిడం వల్ల ఈ పనికాదు. పదవులపై కోరిక ఈషణ్మాత్రం లేకుండా అధికార వ్యామోహానికి చాలా దూరంగా ఉండే వ్యక్తులు ఈ పనికై అవసరం. అట్టి వ్యక్తుల సానుభూతి ఆత్మీయత త్యాగనిరతి నిరంతర పరిశ్రమ వలన ఈ కార్యం సిద్ధిస్తుంది.

—**స్వర్గీయ భయ్యాజీ దాణే.**